శ్రీః

శ్రీరుద్రయామలాంతర్గత

# కుణ్డలినీస్తవః

వ్యాఖ్యాత : శ్రీ చింతగుంట సుబ్బారావు.

# కుణ్డలినీసహస్రనామస్తోత్రమ్




ప్రకాశకులు :

## స్వామి సహజానంద

విజయవాడ.

శ్రీః

రుద్రయామలాంతర్గత

## కుణ్డలినీస్తవః

వ్యాఖ్యాత : శ్రీ చింతగుంట సుబ్బారావు

## కుణ్డలినీసహస్రనామస్తోత్రమ్

*ముద్రణ : జనవరి-2014*

*ప్రతులు : 1000*

*పేజీలు : 84*

*వెల రూ. : 60-00*



**RAVI MOHAN RAO,** M.Sc., M.A.,
Dandy House,
Flat No : 404, Janjanam Complex,
Opp. I Town Police Station,
CHIRALA-523 155, Prakasam Dist.
Cell : 9440115411

***D.T.P. by :-***
L.Durga Prasad,
**Sanjay Graphics,**
CHIRALA.
Cell : 9966156263

***Printed at -***
**Karshak Art Printers,**
**HYDERABAD**

# 'జయద'

ఇది రుద్రయామలమ్ షష్ఠపటలానికి తెలుగులో ప్రతిపదార్థతాత్పర్య వివరణలను కూర్చిన చిన్న పొత్తం. **అథ భావం వద శ్రీదే** అంటూ భావప్రాధాన్యాన్ని ప్రస్తావిస్తూ మొదలవుతుంది.

భావశబ్దం భూధాతూద్భవం. ఉనికి, పరిణామం అని ధాత్వర్థం. కనుక ఇది ప్రకృతినీ, పురుషునీ కలిపే శబ్దం. భవుడు శివుడు. భవాని శివశక్తి. వీరు కలిసే స్థానం భవం, కలయిక భావం. ఇది భావశబ్దానికి తాత్త్వికార్థం. భావం భవుని ఉనికి కనుక, భావం నుండి భవం జనించింది కనుక, సాధకుడు భావాన్ని ఆశ్రయించి, తాదాత్మ్యం చెంది, భవుని చేరవలె అన్నది పరిణామరూపన్యాయం. స్థూలంగా ఇది బాల్య, యౌవన, వార్ధక్యానుభవాల పరిణామప్రతిరూపం. ఈ పరిణామ క్రమం భావరూపంలో పశు, వీర, దివ్య భావాలని ఆరోహణక్రమంలో చెప్పబడినవి. ఈ మొత్తం ప్రక్రియలో రుద్రుడు శివుడవుతాడు, భయంకరుడు అభయంకరుడవుతాడు. ఎందుకంటే భావాలన్నీ రుద్రునిలో లయించి, భవము శమించి, పర్యవసానంగా ఆనందం అర్ణవమవుతుంది.

ఈ సాధనలో భాగం శ్రీదేవతోపాసన. కుండలినీరూపంలో అంతర్యామిగా ఉండే శివశక్తిని జ్ఞానరూపుడైన శివునితో చేర్చటమే ఈ సాధనకు లక్ష్యం.

సాధకులు సాధనకుపక్రమించే ముందు అందుకాలంబనయైన విశేషాలు తెలియటం మంచిది. గురువునాశ్రయించి లక్ష్యాన్ని సాధించటం నిరపాయమార్గం. కేవల జిజ్ఞాసాతృప్తికైనా ఇవి తెలియదగిన విషయాలే.

**శివోఽవతు! శివావతు! శివం భవతు!**

**ఆత్మీయుడు**

**చింతగుంట సుబ్బారావు**



శ్రీః

# బగలాముఖీ కవచమ్

శ్రుత్వా చ బగలాపూజాం స్తోత్రం చాపి మహేశ్వర! ।
ఇదానీం శ్రోతుమిచ్ఛామి కవచం వద మే ప్రభో! ॥

వైరినాశకరం దివ్యం సర్వాశుభవినాశనమ్ ।
శుభదం స్మరణాత్ పుణ్యం త్రాహి మాం దుఃఖనాశనమ్ ॥

శ్రీ భైరవ ఉవాచ

కవచం శృణు వక్ష్యామి భైరవి ప్రాణవల్లభే ।
పఠిత్వా ధారయిత్వా తు త్రైలోక్యే విజయీ భవేత్ ॥

ఓం అస్య శ్రీబగలాముఖీకవచస్య నారద ఋషిః । అనుష్టుప్ఛందః । బగలాముఖీ దేవతా ।
లం బీజమ్ । ఙ్రీం శక్తిః । ఐం కీలకమ్ । పురుషార్థచతుష్టయసిద్ధయే పాఠే వినియోగః

ఓం శిరో మే బగలా పాతు హృదయమేకాక్షరీ పరా ।
ఓం హ్లీం ఓం మే లలాటే చ బగలా వైరినాశినీ ॥

గదాహస్తా సదా పాతు ముఖం మే మోక్షదాయినీ ।
వైరిజిహ్వాధరా పాతు కంఠం మే బగలాముఖీ ॥

ఉదరం నాభిదేశఞ్చ పాతు నిత్యం పరాత్పరా ।
పరాత్పరతరా పాతు మమ గుహ్యం సురేశ్వరీ ॥

హస్తౌ చైవ తథా పాదౌ పార్వతీ పరిపాతు మే ।
వివాదే విషమే ఘోరే సంగ్రామే రిపుసంకటే ॥

పీతాంబరధరా పాతు సర్వాంగీ శివనర్తకీ ।
శ్రీవిద్యా సమయం పాతు మాతంగీ పూరితా శివా ॥

పాతు పుత్రం సుతాంశ్చైవ కలత్రం కాలికా మమ ।
పాతు నిత్యం భ్రాతరం మే పితరం శూలినీ సదా ॥

రంధ్రే హి బగలా దేవ్యాః కవచం మన్ముఖోదితమ్ ।
న వై దేయమముఖ్యాయ సర్వసిద్ధిప్రదాయకమ్ ॥

పాఠనాద్ధారణాదస్య పూజనాద్ వాంఛితం లభేత్ ।
ఇదం కవచమజ్ఞాత్వా యో జపేత్ బగలాముఖీమ్ ॥

పిబంతి శోణితం తస్య యోగిన్యః ప్రాప్య సాదరాః ।
వశ్యే చాకర్షణే చైవ మారణే మోహనే తథా ॥

మహాభయే విపత్తౌ చ పఠేద్వా పాఠయేత్తు యః ।
తస్య సర్వార్థసిద్ధిః స్యాద్ భక్తియుక్తస్య పార్వతి! ॥

ఇతి శ్రీరుద్రయామలే బగలాముఖీ కవచమ్ సంపూర్ణమ్ ।

శ్రీః

శ్రీరుద్రయామలాంతర్గత

# కుణ్డలినీస్తవః

## (ఆరవ పటలము)

**భైరవ ఉవాచ**

భైరవః = భైరవుడు, ఉవాచ = పలికెను.

**శ్లో॥ అథ భావం వద శ్రీదే!**
**దివ్యవీరపశుక్రమాత్ ।**
**పశూనాం పరమాశ్చర్య -**
**భావం శ్రోతుం సముత్సుకః ॥ 1**

**శ్లో॥ ఇచ్ఛామ్యాహ్లాదజలధౌ**
**స్థితో౽హం జగదీశ్వరి ।**
**యది భాగ్యవశాదాజ్ఞా -**
**సారం చిన్తయ సిద్ధయే ॥ 2**

**ప్రతిపదార్థము :** జగదీశ్వరి = జగత్తునకు స్వామినీ!, భాగ్యవశాత్ = భాగ్యవశమున, ఆహ్లాదజలధౌ = సంతోష సముద్రమున, స్థితః = ఉన్నవాడనై, పశూనామ్ = పశువుల యొక్క, పరమ = మిక్కిలి, ఆశ్చర్య = ఆశ్చర్యకరమగు, భావమ్ = భావమును గురించి, శ్రోతుమ్ = వినుటకు, అహమ్ = నేను, సముత్సుకః = ఉత్సాహముతో ఉన్నాను. యది = ఒకవేళ, సిద్ధయే = సిద్ధికొరకు, ఆజ్ఞాసారం = జ్ఞానమును, ఇచ్ఛామి = కోరుచున్నవాడనైతే, అథ = అప్పుడు, శ్రీదే! = ఓ శుభములనిచ్చుదానా!, చిన్తయ = విచారించుము, దివ్యవీరపశుక్రమాత్ = దివ్య, వీర, పశు, అనబడు ఈ వరుసలో, భావమ్ = భావమును గురించి, వద = చెప్పుము.

**తాత్పర్యము :** ఓ జగదీశ్వరీ! నేనిప్పుడు ఆనందసాగరంలో నిలిచి ఉన్నాను. ఇది నాకు భాగ్యవశాన లభించినది. నాకు జ్ఞానము పరిపూర్ణంగా సిద్ధించగలందులకు భావమును గురించి వినవలెనని ఉత్సాహముగా ఉన్నది. ఓ శుభదా! నా ఉత్సాహము, కోరిక సరియైనదిగా విచారించి, దివ్య, వీర, పశు, అను ఈ క్రమములో భావమును గురించి తెలియజెప్పుము.

భైరవుడు మహాభైరవిని ఉద్దేశించి అన్నాడు కదా, ఓ మహాభైరవీ! నీవు జగత్తు సమస్తానికీ స్వామినివి. నీకు తెలియరానిదేదీ జగత్తులో లేదు. ఇంతవరకు నీవు చెప్పగా విన్నదానివలన నేనిప్పుడు మహదానందంలో ఉన్నాను. ఇది నాకు లభించిన మహద్భాగ్యము. అయితే నా జ్ఞానము పరిపూర్ణము కాకున్న, నా ఆనందము సంపన్నము కాదు. కనుక జగత్తుయొక్క భావమును గూర్చి తెలిసికొనవలెనని కోరికతో ఉన్నాను. నా కోరిక తీర్చుట న్యాయమని విచారించి, నాకు దివ్యభావము, వీరభావము, పశుభావము అనువాని గురించి వరుసగా చెప్పుము.

**పశుభావః**

**మహాభైరవ్యువాచ**

**శ్లో॥ పశునాథ! వీరనాథ!**
**దివ్యనాథ! కృపానిధే! ।**
**ప్రకాశహృదయోల్లాస!**
**చంద్రశేఖర! తత్ శృణు ॥ 3**

**శ్లో॥ కాలీం కలాలతాకారం**
**తపస్యాద్వయసంగతిమ్ ।**
**పశుభావస్థితాం నాథ!**
**దేవతాం శృణు విస్తరాత్ ॥ 4**

పశుభావము

మహాభైరవి ఇట్లనెను

**ప్రతిపదార్థం :** పశునాథ! = ఓపశుపతీ!, వీరనాథ! = ఓ వీరనాథ!, దివ్యనాథ! = ఓ దివ్యనాథ!, కృపానిధే! = ఓ కరుణాసముద్రా!, ప్రకాశ = ప్రకటితమైన, హృదయ = హృదయముయొక్క, ఉల్లాస! = సంతోషముగలవాడా!, చంద్రశేఖర! = చంద్రుని సిగపై దాల్చినవాడా!, తత్ = దానిని, ఆ విషయమును, శృణు = వినుము. (3)

నాథ! = ఓ ప్రభూ, కలాలతాకారమ్ = కళలతో కూడిన లతవంటి ఆకారము గలది, తపస్యా = తపస్సుచేత, అద్వయ = అద్వైతస్థితిని, సంగతిమ్ = పొందిన, పశు భావస్థితామ్ = పశుభావములో ఉన్నదియునైన, దేవతాం కాలీం = కాళియను దేవతను గురించి, విస్తరాత్ = విస్తారరూపమున, వివరముగా, శృణు = వినుము. (4)

**తాత్పర్యం :** ఓ కరుణానిధీ! స్వామీ! పశుపతివి నీవే. వీరనాథుడవు నీవే. దివ్యనాథుడవు

నీవే. చంద్రశేఖరా! ఆనందహృదయా!, మీరడిగిన విషయం విస్తరించి చెబుతాను. వినండి. (3)

తీగవంటి ఆకారంలో కళలతో కూడి ఉండేది, తపస్సు ద్వారా అద్వైతస్థితిని పొందినది, పశుభావంలో ఉన్నది, కాళీ అనే దేవత. ఆమెను గురించి చెబుతాను, వినండి. (4)

చెప్పుమని అడిగిన భైరవుడు అజ్ఞాని కాడు. ఆతడు పై శ్లోకాలలో తానున్నట్లు చెప్పిన ఆనంద సముద్రం జ్ఞానసముద్రమే. వాని హృదయప్రకాశం జ్ఞానకాంతియే. అయినప్పటికీ అంత వినయంగా తానడిగినది లోకకైంకర్యం కోసమే. జ్ఞానం వలన వినయం సిద్ధించవలె అని లోకం గ్రహించగలందులకే వాని వినయం. అది ప్రదర్శన కాదు, వాని శీలంగా ప్రకటమైనది.

అంతటి జ్ఞాని భైరవిచేత చెప్పించటమెందుకు? తానే చెప్పవచ్చును కదా?! అంటే, క్రియాశక్తిగా లోకాలను నడిపించే భైరవిదే గురుస్థానం. లోకంలో ఎవరు యే జ్ఞానాన్ని పొందినప్పటికిన్నీ, అది ఆ క్రియాశక్తి, ప్రకృతియైన, భైరవిద్వారా పొందవలసినదే, అన్న ధర్మాన్ని అనుసరించి భైరవిచేత చెప్పించటం.

పశుభావం అంటే జీవభావం. జీవభావం ప్రకృతి సంబంధి. ప్రకృతి ద్వైతభావానికి మూలం. ఈ భావంలో లోకాన్ని పాలించే దేవత కాళి. ఆమె కళామయి. కళ అన్నది కాంతి విన్యాసం, అంటే, అది జ్ఞానవిన్యాసం. శుద్ధమైన కాంతికిరణం పట్టకంలో నుండి ప్రసరించి పలు వర్ణమై ప్రకటమవుతుందికదా. ఆ వర్ణాలే ఈ కళలు. ఈ భిన్నత్వం మరల ఏకత్వంగా పర్యవసించ వలెనంటే, మార్గం తపస్సు. అంటే, కాళీమాత భిన్న కళామయియైన బాహ్యస్వరూపంతోను, స్వచ్ఛమైన అద్వైత జ్ఞానరూపంతోనూ విలసిల్లే దేవత, అని భావం. ఆమెను గురించి విస్తరించి చెప్పటం అంటే ఈ రెండు రూపాలను వివరించటం అన్నమాట.

**శ్లో॥ దుర్గాపూజాం శివపూజాం**
**యః కరోతి పశూత్తమః ।**
**అవశ్యం హి యః కరోతి**
**పశురుత్తమః స్మృతః ॥ 5**

**శ్లో॥ కేవలం శివపూజాం**
**చ కరోతి యది సాధకః ।**
**పశూనాం మధ్యమః శ్రీమాన్**
**శివయా సహ చోత్తమః ॥ 6**

**ప్రతిపదార్థం :** యః పశు+ఉత్తమః = యే ఉత్తమ జీవుడు, దుర్గాపూజామ్ = దుర్గయొక్క పూజను, శివపూజామ్ = శివునియొక్క పూజను, కరోతి = చేయుచున్నాడో, అవశ్యం హి = నిశ్చయముగనే, యః = ఎవడు, కరోతి = చేయుచున్నాడో, ఉత్తమః = ఉత్తముడైన, పశుః = జీవుడు (అని), స్మృతః = చెప్పబడుచున్నాడు. (5)

చ = మరియు, సాధకః = సాధకుడు, కేవలమ్ = అచ్చముగా, శివపూజాం = శివపూజను, కరోతి యది = చేయుచున్నవాడైనట్లయిన, పశూనామ్ = జీవులలో, మధ్యమః = మధ్యముడు, శ్రీమాన్ = భాగ్యశాలియైన, ఉత్తమః = ఉత్తముడు, శివయా సహ = పార్వతితో, దుర్గతో సహ. (6)

**తాత్పర్యం :** యే జీవోత్తముడు దుర్గాపూజను, శివపూజను చేయునో ఆతడు నిశ్చయముగా ఉత్తముడైన జీవుడుగా గుర్తించబడుచున్నాడు. (5)

శివపూజను మాత్రమే చేయువాడు మధ్యమ జీవుడు. దుర్గతో సహ శివుని పూజించు భాగ్యశాలి ఉత్తముడు. (6)

**పశూత్తమః** అంటే పశువులలో ఉత్తమ జన్ముడు, నరుడు. మానవులందరూ పశూత్తములే. కాని **పశుః ఉత్తమః**, అంటే ఉత్తముడైన జీవుడు. మానవులందరూ పశూత్తము లనటం ఎట్లా? అంటే మరియే జీవిలోనూ లేని తర్కశక్తి, విచక్షణ మానవులందరిలో ఉన్నది. కాని దుర్గాశివులనిద్దరినీ పూజించినప్పుడే ఆ జీవి ఉత్తముడవుతాడు. వీరిలో అభేదత్వాన్నీ, వీరిద్దరి కలయికలోని పూర్ణత్వాన్నీ, అద్వైతసిద్ధినీ సూచించేటందుకే **శివ–శివా** శబ్దాలు రెండింటినీ ప్రయోగించటం.

**శ్లో॥ కేవలం వైష్ణవోఽధీశః**
**పశూనాం మధ్యమః స్మృతః ।**
**భూతానాం దేవతానాం చ**
**సేవాం కుర్వన్తి యే సదా ॥ 7**

**శ్లో॥ పశూనాం మధ్యమాః ప్రోక్తం**
**నరకస్థా న సంశయః ।**
**త్వత్సేవాం మమ సేవాం చ**
**విష్ణుబ్రహ్మాదిసేవనమ్ ॥ 8**

**శ్లో॥ కృత్వాన్యసర్వభూతానాం**
**నాయికానాం మహాప్రభో ।**
**యక్షిణీనాం భూతినీనాం**
**తతః సేవా శుభప్రదా ॥ 9**

**ప్రతిపదార్థం :** కేవలమ్ = అచ్చముగా, వైష్ణవః = విష్ణుభక్తుడై, అధీశః = వానినే అధీశునిగా తలచువాడు, పశూనామ్ = పశువుల, జీవులయొక్క, మధ్యమః = మధ్యమస్థాయివాడుగా, స్మృతః = తలచబడుచున్నాడు. చ = మరియు, భూతానామ్ = భూతములయొక్క దేవతలయొక్క, సేవామ్ = సేవను, సదా = ఎల్లవేళలలో, యే = ఎవరు, కుర్వన్తి = చేయుచున్నారో, (7)

పశూనామ్ = పశువులయొక్క, మధ్యమాః = మధ్యములుగా, ప్రోక్తమ్ = చెప్పబడినది, (తే = వీరు) నరకస్థాః = నరకమునబడువారు, సంశయః = అనుమానము, న = లేదు. త్వత్ = నీయొక్క, విష్ణు = విష్ణువు, బ్రహ్మ = బ్రహ్మ, ఆది = మొదలైనవారిని, సేవనమ్ = సేవించుటను, (8)

కృత్వా = చేసి, అన్య = ఇతరులైన, సర్వ = అన్ని, భూతానామ్ = భూతముల యొక్క, నాయికానామ్ = నాయికలయొక్క, యక్షిణీనామ్ = యక్షిణులయొక్క, భూతినీనామ్ = భూతినుల యొక్కయు, సేవా = సేవ, తతః = అటుపై చేయుట, శుభప్రదా = శుభములనిచ్చునది. (9)

**తాత్పర్యం :** పూర్తిగా వైష్ణవుడై, విష్ణువే అధీశుడనువాడు జీవులలో మధ్యముడని చెప్పబడువాడు. ఎవరు భూతముల, దేవతల, సేవనే ఎప్పుడూ చేస్తారో, వారుకూడ మధ్యములని చెప్పబడినది. ఇట్టివారు నరకంలో పడగలరన్నది నిస్సంశయం. తమరి సేవను, నా సేవను, విష్ణుబ్రహ్మాదుల సేవనుకూడా చేసి, ఆపై మిగత భూతములను, నాయికలను, యక్షిణులను, భూతినులను సేవించటం శుభప్రదం.

పూజ, సేవ అన్నవి మానవజాతికి మాత్రమే అన్వయించే విషయాలు కనుక,

మానవులు జీవులలో ఉత్తములని ముందే చెప్పబడింది కనుక, ఇక్కడ మధ్యముడంటే మానవులలో మధ్యముడనే అర్థం. మానవులలో మతభేదాలు లెక్కలేనన్ని. వానిలో ప్రధానమైనవి శైవ, వైష్ణవ, శాక్తేయాలు హిందూమత సంబంధి. అన్యమతాలు మరిన్ని. ఈ భేదాలు ద్వేషాలుగా మారి విధ్వంసాన్ని సృష్టించినది చరిత్ర. ఇది శాస్త్రవిరుద్ధం సుమా! అన్న హెచ్చరిక ఈ శ్లోకాలలో ధ్వనిస్తున్నది. సత్యం ప్రధానదేవతలందరినీ సమాన భక్తిప్రపత్తులతో పూజించిన తరువాత అన్యదేవతలను మొ॥ వారిని సేవించదగునన్నది. ఈ సత్యాన్ని ఆదరించినవారు ఉత్తములు, నిరాదరించినవారు మధ్యములు. అసలు సేవ, పూజ అన్న ఊసే ఎత్తనివారు అధములు.

**పశువులు** అంటే జీవులు. ఇది చైతన్యం గల తిర్యక్ప్రపంచానికి సంబంధించినది. జీవులలో ఎన్నో స్తరాలున్నవి. దేవతలు, భూతాలు, నాయికలు, యక్షిణులు, భూతినులు ఇత్యాది. **భూత**శబ్దానికి సృష్టిలోని చరాచరాలు అన్నీ అన్వయ మవుతాయన్నది ప్రాథమికార్థం. కాని గాలి, నిప్పు, నీరు, భూమి, ఆకాశం, అన్న ఈ అయిదిటినీ పంచభూతాలుగా పరిగణించటం పరిపాటి. ఇక్కడ భూతానాం అనటంలో ఉద్దిష్టాలు ఇవే అనవచ్చు. అట్లే, **దేవతలు** అనగా త్రిమూర్తులు కాక, ఇంద్ర వరుణయమాది వారుద్దిష్టులు. యక్షుల స్త్రీలు **యక్షిణులు.** వీరు దేవయోనులు. భూతశబ్దానికి బాల గ్రహాదులర్థం చెప్పబడింది కనుక **భూతినులు** స్త్రీగ్రహాలు.

శ్లో॥ **యః పశుర్బ్రహ్మకృష్ణాది**
**సేవాం కుర్వన్తి యే సదా ।**
**తథా శ్రీతారకబ్రహ్మ**
**సేవాద్వయే నరోత్తమాః ॥** **10**

శ్లో॥ **తేషామసాధ్యా భూతాది-**
**దేవతాః సర్వకామదాః ।**
**వర్జయేత్ పశుమార్గేణ**
**విష్ణుసేవాపరో జనః ॥** **11**

**ప్రతిపదార్థం :** యః = ఏ, పశుః = జీవుడు, బ్రహ్మకృష్ణాది = బ్రహ్మ, కృష్ణుడు మొదలైన వారిని, యే = ఎవరు, తథా = అట్లే, సదా = ఎల్లవేళల, శ్రీ తారకబ్రహ్మ = శ్రీచక్రము, తారకము, బ్రహ్మ లేక తారక బ్రహ్మ అను వీరి యొక్క, సేవామ్ = పూజను, సేవా = సేవయందు, అద్వయే = భేదభావములేకుండ, కుర్వన్తి =

చేయుచున్నారో, (తే = వారు), నరోత్తమాః = నరులలో ఉత్తములు. (10)

తేషామ్ = వారికి, అసాధ్యాః = అసాధ్యులైన, భూతాది = భూతములు మొదలు, సేవతాః = దేవతల పర్యంతము, సర్వ = అన్ని, కామదాః = కోరికలను ఇచ్చువారు. విష్ణుసేవాపరః = విష్ణుని సేవలో అంకితబుద్ధిగల, జనః = మనుజుని, పశుమార్గేణ = జీవుల మార్గము నుండి, వర్జయేత్ = విడువవలెను. (11)

**తాత్పర్యం :** ఏ జీవుడు బ్రహ్మ, కృష్ణుడు మొదలైనవారిని, అట్లే, యే నరోత్తములు శ్రీచక్రమును, తారకమంత్రమును, బ్రహ్మమును అద్వయబుద్ధితో, అంటే, నిశ్శంకగా, సేవింతురో, వారికి సాధించరాని భూతాది దేవతలు అన్ని కోరికల నిచ్చువారు అగుదురు. కాని విష్ణుసేవాపరాయణుడైనవాడు జీవి మార్గము ననుసరించువాడు కాడు.

త్రిమూర్తులలోని బ్రహ్మనుగాని, అవతారమూర్తులలోని కృష్ణుడు మొదలగు అవతారమూర్తులనుగాని, లేదా, తంత్రశాస్త్రమున తంత్రరాజముగ చెప్పబడిన శ్రీచక్రోపాసకులుగాని, మంత్రరాజమైన తారకమంత్రోపాసకులు గాని, లేక నిర్గుణ బ్రహ్మోపాసకులుగాని వీరందరూ తమ తమ పూజ, ఉపాసనాదులలోని నిర్ద్వంద్వ బుద్ధి కారణముగా నరులలో ఉత్తములగుదురు. ఇట్టి వీరికి భూతములు మొదలైన దేవతలు ప్రత్యేకము పూజాదులతో సేవింపబడకున్నను, అన్ని కోరికలను ఇవ్వగలరు. విష్ణుసేవాతత్పరుడైన వాడు ఈ జీవులననుసరించు మార్గమున పోవువాడని భావించరాదు. అంటే, వానిని మిగత జీవులతో కలిపి లెక్కగట్టరాదు, వాని మార్గమే వేరు.

**శ్లో॥ ప్రవక్తవ్యం చ పటలే**
**తేషాం తేషాం తతస్తతః ।**
**విధినా విధినా నాథ!**
**క్రమశః శృణు వల్లభ! ॥ 12**

**ప్రతిపదార్థం :** నాథ! = ఓ స్వామీ!, వల్లభ! = ఓ ప్రియభర్తా!, పటలే = ఈ పటలములో, తేషాం తేషామ్ = వారి వారి యొక్క, విధినా విధినా = విధి విధానములతో, తతస్తతః = ఆయా సందర్భములలో, క్రమశః = ఒకదాని తరువాత మరియొకటిగా, ప్రవకవ్యమ్ చ = చెప్పబడదగినది కూడ, శృణు = వినుము.

**తాత్పర్యం :** ఓ ప్రియమైన స్వామీ! ఈ పై జెప్పిన వారి నందరిని గురించి సరియైన సందర్భంలో వారి వారి విధివిధానాల వివరాలతో కూడ ఈ పటలంలో చెప్పవలసి యున్నది కూడ వినుము.

**పటలం** అంటే ఒక సమూహం అని అర్థం ఇక్కడ వర్తిస్తుంది. ఈ ప్రాథమికార్థాన్ని గ్రహించే ఈ గ్రంథ భాగాలకు పటలములని పేరు పెట్టబడింది. అయితే ఈ సమూహం అంతటినీ ఒకటిగా చేయగల సూత్రం ఒకటి ఉంటుంది. ఈ విభాగంలో ఆ సూత్రం **భావం** అని మొదటే విదితమయింది.

**విధి** శబ్దానికి అనేకార్థాలున్నవి, ఒక పవిత్రమైన ఆజ్ఞ, లేక ఆచారము, లేక నడవడిక, గమ్యము, ఇట్లా. ఇక్కడ సందర్భోచితంగా ఈ అర్థచ్ఛాయలను గ్రహించవలె.

## సుషుమ్నా సాధనమ్

**శ్లో॥ అథ ప్రాతః సముత్థాయ పశురుత్తమపండితః ।**
**గురూణాం చరణాంభోజమంగలం శీర్షపంకజే ॥ 13**

**శ్లో॥ విభావ్య పునరేకం హి శ్రీపాదం భావయేద్యది ।**
**పూజయిత్వా చ వీరం వై ఉపహారైర్నమేః స్తవైః ॥ 14**

**ప్రతిపదార్థం :** ఉత్తమపండితః పశుః = ఉత్తమ పండితుడైన జీవుడు, (పశుః = పశుభావములోనున్న, ఉత్తమపండితః = ఉత్తమపండితుడు), ప్రాతః = సూర్యోదయమునకు మునుపే, సముత్థాయ = చక్కగా నిద్ర మేల్కొని, గురూణామ్ = గురువుల యొక్క, చరణ అంభోజ మంగలమ్ = మంగళకరమైన పాదపద్మములను, శీర్షపంకజే = శిరః పద్మమున, విభావ్య = విశేషముగ భావించి, అథ = ఆపై, ఉపహారైః = పూజా నైవేద్యాదికములచే, వీరమ్ = వీరభావమున ఉన్న దేవతను, పూజయిత్వావై = పూజించియే, పునః = మరల, ఏకం హి = ఒక్కటేయైన, శ్రీపాదమ్ = శ్రీపాదమును, భావయేత్ యది = భావించినచో, స్తవైః చ= స్తోత్రములతో కూడ, నమేః = నమస్కరింపదగును.

**తాత్పర్యం :** పశుభావంలో ఉన్న ఉత్తమ పండితుడు సూర్యోదయమునకు ముందే నిద్రమేల్కొని గురువుల పాదములను తన మనస్సులో విశేషంగా భావించి, ఆపై వీరభావంలో ఉన్న దేవతను పూజాద్రవ్యములతోనూ నైవేద్యాదులతోనూ సేవించి,

మరల ఒక్కటేయైన శ్రీపాదాన్ని భావించి, స్తుతించి, నమస్కరించవలెను.

సుషుమ్నా సాధనవిధానం ఇట్లా చెప్పబడింది : ఇడ, పింగళ అను పేర్లు గల నాడుల మధ్య ఉండే ఒకానొక నాడి పేరు **సుషుమ్నా.** ఎడమవైపు ఇడా, కుడివైపు పింగళా శరీరంలో ఉంటాయని యోగశిఖోపనిషత్తు చెబుతున్నది. ఇడ, పింగళలు ఉచ్ఛ్వాస–నిఃశ్వాసల రూపంలో అనుభవంలో ఉన్నవే. వాని యౌగిక సంపత్తి మాత్రం సాధకులకే ఎఱుక. సుషుమ్నా అన్నది సుషుప్తి అంటే గాఢనిద్రావస్థగా అనుభవం. యోగసాధకులకు ఇది ప్రత్యేకం శ్రద్ధగా సాధించదగినది.

**శీర్షపంకజే** అనటం వలన కేవలం మనస్సులో అని కాక, సహస్రారపద్మంలో గురువును వారి పాదాల రూపంలో భావించవలెనని ఉద్దేశం.

శ్రీపాదం అంటే శ్రీయొక్క పాదము, అని ఒక అర్థం. శ్రీలకు నెలవైనది అని వేరొక అర్థం. మొదటి అర్థంలో అయితే, లక్ష్మీదేవి పాదమును అని అర్థమవుతుంది. కాని పాదాలు ఎప్పుడూ రెండుగానే చెప్పబడతాయి ద్వివచనరూపంతో. ఒక్క పాదం అని చెప్పినప్పటికీ రెండూ గ్రాహ్యమే అనవచ్చు. అన్నమయ్యగారి, బ్రహ్మ కడిగిన పాదము, అన్న సంకీర్తనను ఉదాహరణగా చూపవచ్చు. అయితే **ఏకం హి శ్రీపాదం భావయేత్** అన్నదానికి, ఒక్క శ్రీపాదమును మాత్రమే భావించదగును, అని అర్థం చెప్పినప్పటికీ, ఈ శ్రీపాదము సర్వదేవతల స్థానముల నతిక్రమించి యున్న శ్రీపాదము, పోతన గారి శ్రీకైవల్యపదంబు కావచ్చుననిపిస్తున్నది. పశుభావానికి గమ్యం ఈ పరమమైన దైవభావమే కదా.

**శ్లో॥ త్రైలోక్యం తేజసా వ్యాప్తం**
**మండలస్థాం మహోత్సవామ్ ।**
**తడిత్కోటిప్రభాదీప్తిం**
**చంద్రకోటిసుశీతలామ్ ॥ 15**

**శ్లో॥ మహావజ్ర సర్పరాజ సదృశీం ధ్యానయోగినీమ్ ।**
**సదావాయు సామ్యశ్రీం కారణోల్లాస వర్ధినీమ్ ।**
**సుప్తాం యోగిభిరాభాస్యాం శోణవేదికోపరి ।**
**యోగిధ్యేయాం సూక్ష్మవిద్యాం భావినీమున్ననోభయామ్ ॥**

(అధికపాఠం)

శ్లో॥ సార్ధత్రివలయాకారాం
స్వయంభూలింగవేష్టితామ్ ।
ఉత్థాపయేన్మహాదేవీం
మహారక్తాం మనోన్మయీమ్ ॥ **16**

**ప్రతిపదార్థం :** (యస్యాః = ఏ శ్రీదేవియొక్క), తేజసా = తేజస్సుచేత, త్రైలోక్యమ్ = మూడు లోకములున్ను, వ్యాప్తమ్ = వ్యాపింపబడియున్నదో, (తాం = అట్టి), మండలస్థామ్ = మండలమునధిష్ఠించియున్న, మహోత్సవామ్ = మహోత్సవ రూపిణియైన, తడిత్ కోటి = కోటి మెఱుపు దీవెల యొక్క, ప్రభా = కాంతి వంటి, దీప్తిమ్ = కాంతి గలదానిని, చంద్ర కోటి = కోటి చంద్రుల యొక్క, సుశీతలామ్ = అధికమైన చల్లదనముగలదానిని, సార్ధత్రివలయాకారామ్ = మూడు వలయములపై అర్ధవలయము ఆకారముగా గలదానిని, స్వయంభూ = తనకు తానై వెలసిన, లింగ = లింగమును, వేష్టితామ్ = చుట్టియున్నదానిని, మహారక్తామ్ = చిక్కని ఎఱ్ఱదనముగల దానిని, మనోన్మయీమ్ = మనోన్మయి యైనదానిని, మహాదేవీమ్ = మహాదేవిని, ఉత్థాపయేత్ = మేల్కొలుపదగును.

**తాత్పర్యం :** ఆ శ్రీదేవి మండలస్థ, మహోత్సవ రూపిణి, కోటి మెఱుపుదీవెల కాంతితో వెలుగునది, కోటి చంద్రుల చల్లదనముతో సేదదీర్చునది, తన తేజస్సుతో మూడు లోకములను వ్యాపించినది. (15)

చిక్కని ఎఱుపు రంగులో నున్నది, మనోన్మయి, మూడు వలయములపై అర్ధవలయముగా స్వయంభూ లింగమును చుట్టియుండు మహాదేవి. ఆమెను ప్రాతఃకాలమున మేల్కొలుపవలయును. (16)

శ్రీదేవి శ్రీమహాలక్ష్మి. ఆమె కాంత్యభిమాని. కనుకే మూడు లోకాలను తన తేజస్సుతో వ్యాపించి యున్నది. శక్తిమండల మధ్యమున ఉన్నది. ఆమె ఉత్సాహరూపిణి కనుక మహోత్సవరూపిణి. ఆమె కాంతి ఇంత – అంత అని చెప్పనలవికాదు. కాని కోటి విద్యుల్లతల కాంతికి సమానమైనదని చెప్పటం కేవలం అనంతదీప్తిమతి అన్న భావాన్ని కల్గించగలందులకే. ఇది అత్యుక్తి, అతిశయోక్తి కాదు. నిజానికిది అల్పోక్తి. మనకు అనుభవంలో ఉన్న వెలుగుతో వేడిమి చేరి ఉంటుంది. మెఱుపు మిరుమిట్లుగొలిపి బాధిస్తుంది. కాని శ్రీదేవి కాంతి కన్నులకు చల్లగా శాంతినీ సౌఖ్యాన్నీ కలుగజేస్తుంది. ఈమె ఎఱుపుదనం జీవకారుణ్యానికి ప్రతీక. అందుకే ఈమె

మనోన్మయి. ఈమె మూడు వలయాలు మూడు లోకాల వ్యాప్తియే. అర్ధవలయము ఆ దేవియొక్క అవ్యక్తప్రభావానికి సంకేతం. మూడు వలయాలు వ్యక్తప్రకృతిసృష్టి. ఈ వ్యక్త ప్రకృతికి కేంద్రమైన అనంతత్వమే స్వయంభూలింగము. ఆ అనంత శివతత్త్వానికి వ్యక్తప్రకాశమే సమస్తసృష్టిని అంతర్బహిశ్చైతన్యరూపమున పరివేష్టించిన శ్రీదేవి. ఆ మహాదేవిని ప్రసన్నం చేసికొనే కార్యమే ఆమెను మేలుకొలుపటం.

**శ్లో॥ శ్వాసోచ్ఛ్వాసద్వయావృత్తిం**
**ద్వాదశాంగులరూపిణీమ్ ।**
**యోగినీం ఖేచరీం వాయు-**
**రూపాం మూలాంబుజస్థితామ్ ॥ 17**

**ప్రతిపదార్థం :** శ్వాస ఉత్ శ్వాస = నిఃశ్వాసము, ఉచ్ఛ్వాసము అను, ద్వయా = రెండు విధములైన, ఆవృత్తిమ్ = వర్తనగల దానిని, ద్వాదశ = పంద్రెండు, అంగుల = అంగుళముల, రూపిణీమ్ = ఆకారముగలదానిని, యోగినీమ్ = యోగినిని, ఖే = ఆకాశమున, చరీమ్ = సంచరించుదానిని, వాయు = వాయువుయొక్క, రూపామ్ = రూపముగలదానిని, మూల = ఆధారమైన, అంబుజ = పద్మమున, స్థితామ్ = నెలకొనియున్నదానిని.

**తాత్పర్యం :** ఆ శ్రీదేవి ఇంకను, ఉత్‌శ్వాస, నిఃశ్వాస అను రెండు విధముల ఆవృత్తి లేక ప్రవర్తన కలిగినది. ఈమె పరిమాణము 12 అంగుళములు. ఈమె యోగిని, ఆకాశగమనము గలది. వాయువు వలె కనరాని రూపము గలది. మూలాధార చక్రము లేక పద్మమున నెలకొని యున్నది.

శ్వాసల రూపంలో ఆవృతమవుతూ జీవులకు అనుభవంలో ఉన్న శ్రీదేవి ప్రాణరూపిణి. ఈమె వాయురూపిణి. ఈమె సంచారం బాహ్యప్రకృతిలోని ఆకాశంలో మాత్రమే కాదు, మానవ శరీరంలోని యౌగికమైన దహరాకాశంలో కూడా. ఆ దేవియొక్క ఈ రెండు విధాల సంచారాలూ కలిసి ఒక ఆవృత్తి. రెండూ కలిస్తేనే శ్వాస, ప్రాణం. ఈ ప్రాణ ప్రసారమున్నంతవరకే జీవభావన, పశుభావన. ఈ పశు భావన ప్రకటరూపంలో **'నేను'** అవుతూన్నది. 'నేను' అన్నది ఉత్‌శ్వాస **(నే),** నిఃశ్వాస **(ను)**, రెండూ కలిసినది. పెదవులు మూసి **'నేను'** ఉచ్చారణను భావిస్తే, ఈ విషయం తేటపడుతుంది.

**మూలాంబుజము** అంటే ఆధారచక్రం లేక మూలాధారచక్రం. ఈ చక్రానికే

పద్మం అని మరొక పేరు. అన్నిటికీ ఇది ఆధారం కనుక దీనికీపేరు. ఇది శరీరంలోని యౌగిక శక్తిపీఠములైన షట్చక్రములు లేక పద్మములలో మొదటిది. వెన్నెముక చివర, విసర్జకావయవమైన గుదస్థానమున నుండునది. ఇది నాలుగు దళముల పద్మము, లేక నాలుగు అరల చక్రము. వినాయకుని నెలవుగా చెప్పబడునది, ప్రథమ పూజ్య స్థానము. ఇదియే సుషుమ్నానాడి కారంభస్థానము, ఆధారము. కుండలినీ శక్తి ఈ పద్మములో చుట్టచుట్టుకుని నిద్రించే సర్పాకారంలో ఉంటుందని యోగులంటారు. ఈ పద్మంలో శ్రీదేవి ఉంటుందని చెప్పటం వలన ఆమె కుండలినీ శక్తి దేవతగా గ్రాహ్య.

**శ్లో॥ చతుర్వర్ణస్వరూపాన్తాం**
**వకారాదిషసాన్తకామ్ ।**
**కోటికోటిసహస్రార్క-**
**కిరణాం కులమోహినీమ్ ॥ 18**

**ప్రతిపదార్థం :** చతుః = నాలుగు, వర్ణ = వర్ణములయొక్క, స్వరూపాన్తామ్ = నిజస్వరూపముగలదానిని, వకారాది = 'వ' అను అక్షరముతో మొదలై, షసాన్తకామ్ = 'ష', 'స' అను అక్షరములతో పూర్తియగుదానిని, కోటి కోటి = కోటి కోట్ల, సహస్ర+అర్క = వేల సూర్యుల, కిరణామ్ =కాంతి గలదానిని, కుల = కులమును, మోహినీమ్ = మోహింపజేయుదానిని.

**పాఠాంతరం : 4వ పాదం : కిరణోజ్జ్వలమోహినీమ్ ॥**

కిరణ = కిరణములచే, ఉజ్జ్వల = ప్రకాశించు, మోహినీమ్ = మోహనరూపము గలదానిని.

**తాత్పర్యం :** నాలుగు వర్ణముల స్వరూపమైన వ, శ, ష, స అను అక్షరములే మూలాంబుజమునకు రేకలుగా గలది ఆ శ్రీదేవి, కోటికోట్ల వేల సూర్య కిరణాల ప్రకాశముగల కులమోహిని ఆమె.

మూలాధారపద్మమునకున్న నాలుగు దళములు వ, శ, ష, స అను వర్ణములు. ఈ పద్మమున నెలకొన్న కుండలినీశక్తి దేవత శ్రీదేవి. ఆమె లెక్కకు మిక్కిలైన సూర్యుల వలె ప్రకాశించునది.

**కులము** అంటే కుటుంబమనిన్నీ, సమూహమనిన్నీ, దేశము, శరీరము అనిన్నీ అర్థాలున్నవి. విశేషార్థంగా, శ్రీవిద్య విషయంలో చెప్పికొనే అర్థం : కుః =

పృథ్వీతత్త్వము, ల = లీయతే = లయించునో, అది కులము. అక్కడ నెలకొన్న దేవత కులమోహినీ అనబడును. భైరవీభైరవులధిదేవతలుగనున్న శాక్తేయ కౌల సంప్రదాయార్థము గ్రాహ్యము. **కౌలమునకిది నిర్వచనము.**

**శ్లో॥ కులం శక్తిరితి ప్రోక్తం**
**అకులం శివ ఉచ్యతే ।**
**కులేఽ కులశ్చ సంబంధః**
**కౌలమిత్యభిధీయతే ॥**

కులం అంటే శక్తి అనిన్నీ, అకులం అంటే శివుడనిన్నీ, ఈ కుల-అకులముల, అంటే, శక్తి-శివుల సంబంధం కౌలమనీ చెప్పబడినది. శక్తిలో శివుడు అంతర్భాగమని భావం.

కనుక పాఠాన్తరము కంటె ఈ పాఠమే సందర్భోచితమని తోస్తూన్నది.

**శ్లో॥ మహాసూక్ష్మపథప్రాన్త-**
**వాన్తరాన్తరగామినీమ్ ।**
**త్రైలోక్యరక్షితాం వాక్య-**
**దేవతాం శంభురూపిణీమ్ ॥ 19**

**ప్రతిపదార్థం :** మహాసూక్ష్మ = ఎంతో సూక్ష్మమైన, పథ = మార్గముయొక్క, ప్రాన్తౌ = ప్రదేశముల, ఆన్తర + ఆన్తర = లోలోపల, గామినీమ్ = సంచరించుదానిని, త్రైలోక్య = మూడు లోకములను, రక్షితామ్ = రక్షించుదానిని, వాక్య = వాక్యమునకు, దేవతామ్ = అధిష్టానదేవతయైనదానిని, శంభు = ఆనందమును కలిగించు, రూపిణీమ్ = రూపముగలదానిని.

**పాఠాన్తరం : వాక్యదేవతాం శంభురూపిణీం** అన్న పాఠానికి బదులు **బాహ్యదేవతాం శబ్దరూపిణీం,** అని. అంటే వ్యక్తమైన దేవతయైన శబ్దరూపిణిని, అని అర్థం. వాక్యము కూడా బాహ్యప్రకటనమే కనుక తాత్పర్యమున భేదము లేదు.

**తాత్పర్యం :** సూక్ష్మాతి సూక్ష్మమైన ప్రదేశములలో గూడ అన్తరాన్తరములలో చరించునది, మూడు లోకాలను రక్షించేది, ఆనందము నిచ్చు రూపముగల వాక్యదేవత, సరస్వతీరూపదేవత ఆ శ్రీదేవియే. ఆమెను నమస్కరించవలెను.

సూక్ష్మమైన కొలది పదార్థభౌతికలక్షణములకు భిన్నముగా నుండును.

స్థూలమున పొడవు, వెడల్పు, ఎత్తు, లోతు, ఇత్యాది కొలమానములుండును, కాని సూక్ష్మమగు కొలది వీని ఉనికి లెక్కకురాదు, ఊహకందదు. స్థూల - సూక్ష్మ - అతిసూక్ష్మ - మహాసూక్ష్మ, ఇవి భౌతికపదార్థస్తరములు. పరమసూక్ష్మమువలె మహాసూక్ష్మము కొలతల కందని బిందు స్థితి. అందులో గూడ లోలోపల సంచరించగలది శక్తిమాత్రమే. శ్రీదేవి శక్తిమాత్రరూప. ఆ శక్తియే ముల్లోకములకు రక్ష. ఆమె జీవులలో అంతరాంతరములలో ప్రసరించుచు, వాక్యరూపమున ప్రకటమగుచుండు సరస్వతి. ఈ ప్రకటనము ఆనందరూపమున కనుక ఆమె శంభురూపిణి. శంభుశబ్దమునకు శివుడని అర్థమున్నది కనుక. ఈ వాక్యరూపము, శబ్దరూపము, ఆనందప్రకటనము, ఆ భైరవీమాత యొక్క శివాత్మకత. ఇది భైరవము.

ఈ శ్లోకంలో శ్రీదేవివైన అవ్యక్తవ్యక్తరూపముల రెండిటి వర్ణన ఉన్నది. ఈ అవ్యక్తమాతృకాచక్రం ఇట్లా ఉంటుంది :-




ఈ చక్రం మధ్యలోని సంవిద్ బిందువు అమృతత్వం. ఇది వికసించి తేజోమయమై త్రికోణమండలమవుతుంది. దీనిలో అకారాది 16, కకారాది 16, థకారాది 16, మకారము బిందువు. ఈ ధ్వనులన్నియు తొలుత అవ్యక్తరూపంలోను, తరువాత వ్యక్త లేక వ్యంజనరూపంలోనూ సృష్టియొక్క నాదబిందు కళా స్వరూపాన్ని తెలుపుతాయి. అవ్యక్తమాతృకారూపం ఈ చక్రంలో చూపబడింది. ఈ భావాన్ని పాఠాన్తరంగా లభించిన **బాహ్యదేవతాం శబ్దరూపిణీం** అన్నది కూడా ప్రకటిస్తున్నది.

**శ్లో॥ మహాబుద్ధిప్రదాం దేవీం**
**సహస్రదలగామినీమ్ ।**

**మహాసూక్ష్మపథే తేజో-**
**మయీం మృత్యుస్వరూపిణీమ్ ॥ 20**

**ప్రతిపదార్థం :** మహాబుద్ధిప్రదామ్ = మహాబుద్ధినిచ్చునట్టి, దేవీమ్ = దేవతను, శ్రీదేవిని, సహస్రదలగామినీమ్ = వేయి రేకల పద్మమునందుండు దానిని, మహాసూక్ష్మపథే = మహాసూక్ష్మమార్గంలో, తేజోమయీమ్ = తేజస్సుతో నిండియుండుదానిని, మృత్యు స్వరూపిణీమ్ = మృత్యురూపముగలదానిని.

**తాత్పర్యం :** గొప్పబుద్ధినిచ్చునది, సహస్రదళపద్మమున నివసించునది, మహాసూక్ష్మ మార్గంలో తేజోమయరూపంతో చరించునది, మృత్యువురూపం గలది ఈ దేవి.

బుద్ధి అన్నదానికి మేల్కొన్నది అని ప్రాథమికార్థం. ఈ మేల్కొన్న బుద్ధి ఇంద్రియవర్తి కావచ్చు, మనోవర్తి లేదా ఆత్మవర్తి కావచ్చు. బుద్ధి దేనియందు ప్రవర్తిస్తుందో దానినిబట్టి ఆ వ్యక్తి వ్యక్తిత్వవికాసం ఉంటుంది. ఇది అలౌకికమైన మహావిషయాలలో ప్రవర్తించినట్లయితే, మహాబుద్ధి అవుతుంది. జీవికి (పశువునకు) బుద్ధి సహజంగా ప్రకృతిచేత ఆకర్షితమై దేహబుద్ధిగా పరిణమిస్తుంది. దాని శక్తి నెఱుగని స్థితిలో ఉంటుంది కనుక ఇది అల్పబుద్ధి అనిపించుకుంటుంది. ఇది దాసబుద్ధిగా మసులుకుంటుంది. ఇంద్రియాలకు దాస్యం చేస్తుంది. ఈ స్థితికి భిన్నంగా జీవబుద్ధితో ప్రవర్తిస్తే, తాను కేవలం పశువును కాదనీ, సాక్షాత్ పశుపతి అంశననీ గ్రహించగలడు. ఈ స్థితినీ దాటి ఆత్మబుద్ధితో ప్రవర్తిస్తే, తానే పశుపతిననిన్నీ తెలియగలడు. ఈ వ్యత్యాసాలను వివరించే ప్రాచీన శ్లోకమిది –

**దేహబుద్ధ్యా తు దాసోఽహం**
**జీవబుద్ధ్యా త్వదంశకః ।**
**ఆత్మబుద్ధ్యా త్వమేవాహం**
**ఇతి మే నిశ్చితా మతిః ॥**

ఈ ఆత్మబుద్ధియే మహాబుద్ధి. దీనిని అనుగ్రహించేది శ్రీదేవి. దేహబుద్ధితో శరీరాన్ని భగవద్దాస్యంలో ప్రవర్తింపజేస్తూ, జీవబుద్ధితో తాను దైవాంశనన్న జ్ఞానంతో దేహబుద్ధిలోని ఇంద్రియలాలసను విసర్జించి, అహంకారాన్ని సంస్కరించికొని రాగద్వేషాలను ప్రేమగా మల్చుకొని, ఆత్మబుద్ధితో దేనినీ అంటక మనుగడ సాగించుటే **శ్రీచక్రోపాసన.**

**మృత్యు** శబ్దానికి యముడని, బ్రహ్మయని, విష్ణువని, మాయయని, కలియని, మన్మథుడని కూడా అర్థాలున్నవి. శ్రీదేవి అంశమాత్రులే, విన్యాసమాత్రులే వీరందరూ కనుక ఈ అర్థాలన్నీ ఆమె యందు అన్వయించేవే. సాధారణార్థంలో, చావు అని భావించినప్పటికిన్నీ, అది కూడా ఆ శక్తి విన్యాసమే కనుక ఈ శబ్దానికి ప్రతీపార్థాన్ని భావించనక్కరలేదు. మృత్యువున్నూ అమృతమయమే అవుతుంది. శ్రీ, క్రియారూపానికి (9వ గణధాతువు, ఉభయపది) వండుట, పక్వము చేయుట అని అర్థం. అనగా మృత్యురూపంలో శ్రీదేవి జీవుని (పశువును) పక్వం చేస్తుందనీ, దైవానుభవానికి సిద్ధం చేస్తుందనిన్నీ అర్థమే తప్ప, నశింపజేస్తుందని కాదు.

**శ్లో॥ కాలరూపాం సర్వరూపాం**
**సర్వత్ర సర్వచిన్మయీమ్ ।**
**ధ్యాత్వా పునః పునః శీర్షే**
**సుధాబ్ధౌ వినివేష్టితామ్ ॥ 21**

**ప్రతిపదార్థం :** కాలరూపామ్ = కాలమే తన రూపముగా గలదానిని, సర్వరూపామ్ = రూపములన్నియు తానేయైనదానిని, సర్వత్ర = అంతట, సర్వ = అన్ని, చిత్‌మయీమ్ = చేతనల రూపమయినదానిని, పునః పునః = మరల మరల, మరి మరి, ధ్యాత్వా = ధ్యానించి, శీర్షే = శిరస్సున, సుధా = అమృతపూర్ణమైన, అబ్ధౌ = సముద్రమునందు, వినివేష్టితామ్ = గుప్తముగా నున్నదానిని.

**తాత్పర్యం :** కాలమే రూపమై, అన్నిరూపాలూ తానై, అంతటా తానుండి అన్ని చేతనలూ తానై తలపైభాగములోని అమృత సముద్రములో గుప్తమైన ఆ దేవిని మరల మరల ధ్యానించవలెను.

కాలరూపిణి కాళి. అన్ని రూపాలూ, అన్ని చేతనలూ, కాలంలో పుట్టి సమసిపోయేవే. కాలం సర్వవ్యాపి. మహాసూక్ష్మంలో కూడ ఇమిడిపోగలదు. ఈ దేవత సహస్రారంలో గుప్తమై ఉంటుంది. అది అమృతస్థానం. ఆమె యందు మనస్సును లగ్నం చేసి ధ్యానించవలెను.

**శ్లో॥ సుధాపానం కారయిత్వా**
**పునః స్థానే సమానయేత్ ।**
**సమానయనకాలే తు**
**సుషుమ్నామధ్యమధ్యకే ॥ 22**

**శ్లో॥ అమృతాభిప్లుతాం కృత్వా**
**పునః స్థానేషు పూజయేత్ ।**
**ఊర్ధ్వోద్గమనకాలే తు**
**మహాతేజోమయీం స్మరేత్ ॥ 23**

**ప్రతిపదార్థం :** ఊర్ధ్వ = పై దిక్కుగా, ఉద్ + గమన = పైకి పోవు, కాలే తు = సమయమునందైతే, మహాతేజోమయీమ్ = మహాతేజశ్శాలినీ రూపమును, స్మరేత్ = స్మరింపవలెను. సుధాపానమ్ = అమృతపానమును, కారయిత్వా = చేయించి, పునః = మరల, స్థానే = స్వస్థానమున, సమానయేత్ = చేర్చవలెను. సమానయన = తీసికొనివచ్చు, కాలే తు = సమయము నందేవో, సుషుమ్నా = సుషుమ్నానాడియొక్క, మధ్య మధ్యకే = నట్టనడిమిప్రదేశమున, అమృత = అమృతముచేత, అభిప్లుతామ్ = తడుపబడినదిగా, కృత్వా = చేసి, పునః = మరల, స్థానేషు = స్థానములలో, పూజయేత్ = పూజింపవలెను.

**తాత్పర్యం :** పై దిక్కుగా తీసికొనిపోవు సమయంలో, శ్రీదేవియొక్క తేజోమయ స్వరూపాన్ని స్మరించవలెను. పైన సహస్రారములో అమృతపానం చేయించిన పిదప మరల ఆ దేవిని స్వస్థానానికి చేర్చవలెను. సుషుమ్నా మార్గంలో సాగే ఈ ప్రయాణం నడుమ దేవిని అమృతస్నానం చేయించవలెను. సహస్రారంలో అమృతపానం చేయించినప్పుడున్నూ, మధ్యేమార్గంలో అమృతస్నానం చేయించినప్పుడున్నూ, మరల దేవిని స్వస్థానం చేర్చినప్పుడు మూలాధారంలోనూ కూడా, మూడు సార్లు, పూజించవలెను.

శ్లో 21 లో చెప్పినట్లు, మూలాధారంలోని కుండలినీ దేవతయైన శ్రీదేవిని ధ్యానించి ఊర్ధ్వదిశగా మూర్ధ్నస్థానానికి చేర్చి, అక్కడి సహస్రారంలో అమృతపానం చేయించి, నడుమ నున్న అనాహతంలో అమృతస్నానం చేయించి, మరల దిగువన మూలాధారం చేర్చటం, ఆయా స్థానాలలో పూజించటం చెప్పబడింది. సుషుమ్నాలో ఆరోహణక్రమంలో ఆరు శక్తికేంద్రాలు : 1. మూలాధారం, 2. స్వాధిష్ఠానం, 3. మణిపూరం, 4. అనాహతం, 5. విశుద్ధం, 6. ఆజ్ఞ. వీనిపై బ్రహ్మస్థానమైన సహస్రారం, అమృత స్థానం. కుండలినీశక్తి దేవత శ్రీదేవి తేజోరూపిణి. కనుకే ఆ రూపాన్ని స్మరించవలెననటం.

శ్లో॥ ప్రతిప్రయాణకాలే తు
సుధాధారాభిరాప్లుతామ్ ।
మహాకులకుండలినీ
మమృతానందవిగ్రహామ్ ॥ 24

శ్లో॥ ధ్యాత్వా ధ్యాత్వా పునర్ధ్యాత్వా
సర్వసిద్ధీశ్వరో భవేత్ ।
తస్మిన్ స్థానే మహాదేవీం
విభావ్య కిరణోజ్జ్వలామ్ ॥ 25

శ్లో॥ అమృతానందముక్తిం తాం
పూజయిత్వా శుభాం ముదా ।
మానసోచ్చారబీజేన
మాయాం వా కామబీజకమ్ ॥ 26

శ్లో॥ పంచాశద్వర్ణమాలాభిః
జప్త్వానులోమసత్వథా ।
విలోమేన పునర్జప్త్వా
సర్వత్ర జయదం స్తవమ్ ॥ 27

శ్లో॥ పఠిత్వా సిద్ధిమాప్నోతి ।
తత్ స్తోత్రం శృణు భైరవ! ॥ 28

**ప్రతిపదార్థం :** ప్రతిప్రయాణకాలే తు = తిరుగు ప్రయాణముచేయు సమయమందేమో, సుధాధారాభిః = అమృతధారలచేత, ఆప్లుతామ్ = నిలువెల్ల తడిసిన, మహాకుల కుండలినీమ్ = మహత్వము గలిగి, పృథ్వీతత్త్వము లీనమగుచోట నుండు కుండలినీ దేవతను, అమృత + ఆనందవిగ్రహామ్ = అమృతపూర్ణమైన ఆనందమే మూర్తియైన దానిని, (24), ధ్యాత్వా ధ్యాత్వా పునర్ ధ్యాత్వా = నిరంతరాయముగ ధ్యానించుచు, సర్వసిద్ధి = అన్ని సిద్ధులకు, ఈశ్వరః = యజమాని, ప్రభువు, భవేత్ = అగును; తస్మిన్ స్థానే = ఆ స్థానమున, కరుణ + ఉజ్జ్వలాం = కరుణచే అధికముగా వెలుగొందుచున్న, మహాదేవీమ్ = మహాదేవిని, విభావ్య = విశేషముగా భావించి, (25), తామ్ = ఆ, అమృత + ఆనందముక్తిమ్ = అమృతమయము, ఆనందమయము అయిన ముక్తి స్వరూపిణిని, శుభామ్ = శుభమైన దానిని, ముదా = సంతోషముతో,

పూజయిత్వా = పూజచేసి, మానస + ఉత్ + చార = మనస్సును దాటి సంచరించు, బీజేన = బీజాక్షరములతో, మాయామ్ = మాయను, వా = లేక, కామబీజకమ్ = కామ బీజమును, (26), అనులోమ = క్రిందనుండి పైకి పోవు పద్ధతియైన, సత్ పథా = మంచి మార్గమైన, పంచాశద్ = ఏబది, వర్ణమాలాభిః = అక్షమాలికలచే, జప్త్వా = జపించి, పునః = మరల, విలోమేన = పై నుండి క్రిందికి దిగునట్టి క్రమముతో, జప్త్వా = జపించి, సర్వత్ర = అంతటనూ, జయదమ్ = జయమునిచ్చు, స్తవమ్ = స్తోత్రమును, (27), పఠిత్వా = పఠించి, చదివి, సిద్ధిమ్ = సిద్ధిని, ఆప్నోతి = పొందును, భైరవ = ఓ భైరవా!, తత్ స్తోత్రమ్ = ఆ స్తోత్రమును, శృణు = వినుము. (28)

**తాత్పర్యం :** తిరుగు ప్రయాణంలో, అమృతస్నానం చేసియున్న మహాకుండలినీ దేవతను, అమృతానందమూర్తిని నిరంతరము ధ్యానించుచు, సాధకుడు అన్ని సిద్ధులను తన వశము చేసికొనును. ఆ స్థానంలో **కరుణామయియైన మహాదేవిని విశేషముగ మనసులో భావించి,** అమృతానందమయియైన ఆ ముక్తి దేవతను పూజించి, మానస జపమార్గమున మాయను లేక కామబీజమును అనులోమ విలోమ పద్ధతులలో ఏబది (50) అక్షరమాలికలచే జపించి, అన్ని విషయములలో జయమునిచ్చు స్తోత్రమును వినిపింతును, వినుము.

**మానసోచ్చారబీజం** అంటే ఓంకారము.
**మాయా** అంటే **హ్రీమ్** అన్న బీజాక్షరం.
**కామబీజం** అంటే **క్లీం** అన్న బీజాక్షరం.

26వ శ్లోకం ఉత్తరార్ధపు భావం : **ఓమ్ హ్రీమ్** అని కాని, లేక, **ఓమ్ క్లీమ్** అనిగాని ముందుగా బీజావాపం చేసి, అటుపై ఈ క్రింది స్తోత్రాన్ని పఠించవలెను. ఈ పఠనం 50 భాషాక్షరాలను అనులోమ, విలోమ పద్ధతులలో లెక్కిస్తూ, 50 + 50 = 100 సార్లు పఠించవలెను. పఠించే ప్రతిపర్యాయమూ, **ఓమ్ హ్రీమ్** లేక **ఓమ్ క్లీమ్** బీజాక్షరాలను ముందుగా పఠించ వలెను. ఈ స్తోత్రం పేరు **జయదస్తోత్రమ్**. ఇది జయమునిచ్చేది కనుకే దీనికీ పేరు.

# కుండలినీస్తవః

**(జయదస్తోత్రము)**

**శ్లో॥ జన్మోద్ధారనిరక్షిణీహతరుణీ! వేదాదిబీజాదిమా**
**నిత్యం చేతసి భావ్యతే భువి కదా సద్వాక్యసంచారిణీ ।**
**మాం పాతు ప్రియదా సవిపదం సంహారయిత్రి ధరే**
**ధాత్రి త్వం స్వయమాదిదేవవనితా దీనాతిదీనం పశుమ్ ॥ 29**

**ప్రతిపదార్థం :** జన్మ = జన్మమును, జన్మము నుండి, ఉద్ధార = ఉద్ధరించు, నిరక్షిణీ = నిర్విశేషముగా రక్షించునట్టి, హ = శివునియొక్క, తరుణీ = ఇల్లాలా!, వేద + ఆది = వేదమునకు ప్రారంభమైన, బీజ = బీజాక్షరమునకు లేక బీజనాదమునకు, ఆది = మొదటిదానవైన, మా = మంగళదేవతా!, మాతృస్వరూపా!, సద్ + వాక్య = మంచి వాక్యమును, సంచారిణీ = ప్రసరింపజేయుదానా!, భువి = భూమిపై, నిత్యం = ప్రతిదినము, చేతసి = మనస్సులో, కదా = ఎప్పుడు, భావ్యతే = భావించబడునో, స్మరించబడునో, ప్రియదా = ప్రియముల నిచ్చు ఆ తల్లి, సంహారయిత్రి = సంహారశక్తియై, పాతు = రక్షించును గాక!, ధరే = సర్వధారణశక్తీ! ధాత్రి = భూదేవీ!, స్వయమ్ = స్వయముగా, ఆదిదేవ = మొదటి దైవముయొక్క, వనితా = ఇల్లాలా!, త్వమ్ = నీవు, దీన + అతిదీనమ్ = ఎంతయో దీనుడనైన, సవిపదమ్ = విపత్తుతో కూడియున్న, పశుం = జీవుని, మాం = నన్ను, పాతు = రక్షించునుగాక!

**తాత్పర్యం :** ఓ మాతృస్వరూపిణీ! మంగళదేవతా! శ్రీదేవీ! నీవు నా జన్మమును నిశ్శేషముగా ఉద్ధరించుదానవు, నన్ను ఈ పశుత్వమునుండి ఉద్ధరించుదానవు. నీవు శివకామినివి. వేదాలకు మూలమంత్రమైనదానవు. సర్వమును ధరించు శక్తిస్వరూపిణివైన భూదేవతవు. నీవు స్వయముగా ఆదిదేవుని ఇల్లాలవు. మంచి వాక్యమును లోకములో సదా ప్రచారము చేయు నాదస్వరూపిణివి. నిన్ను నా మనస్సులో నింపి నిత్యము ఎప్పుడు సంభావింపగలనో కదా!. తల్లీ! నేను విపత్తుతో కూడియున్న దీనుడనగు జీవుడను. నీవు ప్రియముగూర్చు వాత్సల్యము గలదానవు. నన్ను కాపాడుము!.

ఈ శ్లోకంలో కుండలినీమాత సర్వకర్త్రిగను, సర్వధాత్రిగను, సర్వహర్త్రిగను త్రిమూర్త్యాత్మకమై దర్శనమిస్తూన్నది. కర్మజ్ఞానములు రెంటికిన్నీ ప్రథమ జ్ఞానము

నిచ్చిన వేదమునకాదిబీజమైన ఓంకారి. నాదాకృతితో సద్వాక్యమును ప్రచోదనము చేయు సరస్వతీరూపధారిణి. ధారణశక్తితో ధరిత్రియైన సర్వాధారభూదేవి. ఆమెయే భైరవి. మోక్షప్రదాత్రి.

**శ్లో॥ రక్తాభామృతచంద్రికాలిపిమయీ సర్పాకృతిర్నిద్రితా**
**జాగ్రత్కూర్మసమాశ్రితా భగవతీ త్వం మాం సమాలోకయ ।**
**మాంసోద్గంధకుగంధదోషజడితం వేదాదికార్యాన్వితం**
**స్వల్పాన్యామలచంద్రకోటికిరణైర్నిత్యం శరీరం కురు ॥ 30**

**ప్రతిపదార్థం :** అమృతచంద్రికా = అమృతమను వెన్నెలతో, లిపిమయీ = పూత పూయబడిన, రక్త = ఎఱ్ఱని, ఆభా = కాంతిగల, సర్ప+ఆకృతిః = సర్పమువంటి ఆకారముగల, నిద్రితా = నిద్రించినది, జాగ్రత్ = మేల్కొనియుండి, కూర్మ = కూర్మరూపముచే, సమాశ్రితా = ఆశ్రయింపబడుదానా, (లేక, కూర్మ = కూర్మమను వాయువుచే, సమాశ్రితా = ఆశ్రయింపబడినదానా), భగవతీ = భగవతీ!, మాంస + ఉద్ + గంధ = మాంసమునుండి వ్యాపించు, కుగంధ = దుర్వాసనయను, దోష = దోషముచే, జడితమ్ = జడమై పోయిన, (లేక, మాంస + ఉద్గంధ = మాంసముయొక్క సుగంధము, కుగంధ = దుర్గంధములచే, దోషజడితం) శరీరమ్ = శరీరముగల, మామ్ = నన్ను, సమాలోకయ = చక్కగా చూడుము: వేదాది కార్యాన్వితమ్ = వేదిక కార్యనిరతునిగా, స్వల్ప = కొంచెమో, అన్య = గొప్పయో అయిన, అమల = స్వచ్ఛమైన, చంద్ర = చంద్రునియొక్క, కోటికిరణైః = లెక్కలేనన్ని కిరణములతో, నిత్యమ్ = నిత్యునిగా, కురు = చేయుము.

**తాత్పర్యం :** అమృతమయమైన ఎఱ్ఱని కాంతిగలదానా! సర్పము బోలిన ఆకారము గలదానా! నిద్రితా! జాగ్రదవస్థలో కూర్మాకారము గలదానా! భగవతీ! మాంసపు గంధము, తదితర దుర్గంధములవలన జడమైపోయిన శరీరముగలవాడనైన నన్ను చక్కని దృష్టితో చూడుము. నిర్మలమైన కోటి వెన్నెలకాంతులతో నన్ను వేదవిహితమైన కార్యములకు తగినవానినగా, నిత్యునిగా (ప్రతిదినము) చేయుము.

మూలాధారంలో మూడున్నర చుట్టలు చుట్టుకొనియున్న సర్పము ఆకారముతో కుండలినీ శక్తి నిద్రించి యుండునని చెప్పుట పరిపాటి. **నిద్రితా. జాగ్రత్ కూర్మసమాశ్రితా** = నిద్రలేనప్పుడు జాగ్రదవస్థలో కూర్మాకారము నాశ్రయించు దానా! అనుట సరి.

**భగము** అంటే, **ఉత్పత్తిం చ వినాశం చ భూతానామాగతిం గతిం । వేత్తి విద్యామవిద్యాం చ స వాచ్యో భగవానితి ॥** అన్న ప్రమాణాన్నిబట్టి, 1. ఉత్పత్తి, 2. వినాశనము, 3. భూతముల జననము, 4. మరణము, 5. విద్య, 6. అవిద్య, అను ఈ ఆరింటిని తెలిసినవాడు భగవంతుడు. ఈ ఆరున్నూ భగము అనబడునవి. ఈ లక్షణాలు ఆరున్నూ కలిగిన శక్తిరూపిణి భగవతి.

**శ్లో॥ సిద్ధార్థీ నిజదోషవిత్ స్థలగతిర్వ్యాజీయతే విద్యయా**
**కుండల్యాకులమార్గముక్తనగరీమాయాకుమార్గః శ్రియా ।**
**యద్యేవం భజతి ప్రభాతసమయే మధ్యాహ్నకాలేఽథవా**
**నిత్యం యః కులకుండలీజపపదాంభోజం స సిద్ధో భవేత్ ॥ 31**

**ప్రతిపదార్థం :** సిద్ధ + అర్థీ = సిద్ధిని కోరువాడు, (కోరినది పొందినవాడు), నిజ = తనయొక్క, దోషవిత్ = దోషములను తెలిసినవాడు, స్థలగతిః = లౌకికమైన నడవడిక గలవాడు, కులమార్గముక్త = కులమార్గముచే విడువబడిన, నగరీమాయా = లౌకికమాయయొక్క, కుమార్గః = అపమార్గమున నడచువాడు, యః = ఎవడు, నిత్యమ్ = దినదినము, ప్రభాతసమయే = సూర్యోదయవేళ, అథవా = లేక, మధ్యాహ్నకాలే = మధ్యాహ్నవేళలో, ఏవమ్ = ఈ విధముగా, కులకుండలీజప = కులకుండలినీజపము, పదాంభోజమ్ = ఆ దేవత పాదపద్మమును, యది భజతి = భజించినట్లయిన, సః = అతడు, కుండల్యా = కుండలినీ అనబడు, శ్రియా విద్యయా = శ్రీవిద్యచేత, వ్యాజీయతే = బ్రతికించబడును, సిద్ధః = సిద్ధుడు, భవేత్ = అగును.

**తాత్పర్యం :** సిద్ధిని కోరువాడు, తన దోషమెఱిగినవాడు, లౌకికుడు, కులమార్గమును విడిచి, లౌకికమార్గమున నడచువాడు, అపమార్గమున బోవువాడు, ఇట్టివాడెవడైన నిత్యము ప్రభాతవేళ లేక మధ్యాహ్నవేళ, ఈ విధముగా కులకుండలిని జపించి, ఆ దేవి పాదపద్మాన్ని భజించినచో ఆతడు కుండలినీ అనబడు శ్రీవిద్యచే బ్రతికించబడి, సిద్ధుడగును.

**కులమార్గము** అంటే శ్రీదేవిని చేర్చు మార్గము.

**నగరీమాయా** అంటే ప్రాపంచికమైన సాంసారిక మాయ.

**కులకుండలీ :** పృథ్వీతత్త్వము లీనమగు చోటు కులము. ఈ కులమున మూడున్నర చుట్టలు గల సర్పాకార శక్తి పేరు కులకుండలీ. కులకుండలీదేవత శ్రీదేవి. ఆ దేవిని మంత్రాత్మికగా జపించటం కులకుండలీ జపం.

**శ్లో॥ వాయ్వ్యాకాశచతుర్దలేఽతివిమలే వాంఛాఫలోన్మూలకే**
**నిత్యం సంప్రతి నిత్యదేహఘటితా సంకేతితాభావితా ।**
**విద్యాకుండలమానినీ స్వజననీ మాయాక్రియా భావ్యతే**
**యైస్తైః సిద్ధకులోద్భవైః ప్రణతిభిః సత్స్తోత్రకైః శంభుభిః ॥ 32**

**ప్రతిపదార్థం :** వాయ్వ్యాకాశ = వాయువు, ఆకాశము రూపము గల, చతుః = నాలుగు, దలే = దళములుగల, అతి = మిక్కిలి, విమలే = స్వచ్ఛమైనదానా!, వాంఛాఫలోన్మూలకే = కోరికలు, వాని ఫలములు, అను వానిని పెకలించివేయుదానా!, నిత్యమ్ = అనుదినము, నిత్య = నిత్యమైన, దేహ = శరీరమున, ఘటితా = నెలకొన్నదానా!, సంప్రతి = వెంటనే, సంకేతితా = గుర్తుంచబడినదిగా, విద్యాకుండల మానినీ = కుండలినీ విద్యాదేవతా!, స్వజననీ = నా తల్లీ!, మాయాక్రియా = అవాస్తవమైన క్రియలు, కార్యములు గలదానా!, మాయ యనియు, క్రియాశక్తి యనియు తలచబడుదానా!, (ఇట్లని) యైః సిద్ధకులోద్భవైః = యే సిద్ధకులమున బుట్టినవారి చేత, భావ్యతే = భావించబడుచున్నదో, తైః = వారిచే, ప్రణతిభిః = నమస్కారములతో, శంభుభిః = శుభదమైన, సత్స్తోత్రకైః = మంచి స్తుతులచే, భావితా = భావింప బడుదానా!.

**తాత్పర్యం :** మూలాధారమను పేరుగల నాలుగు దళముల పద్మముననుండు, వాయురాకాశరూపములుగల శుద్ధదేవతా! కోరికలను, వాని ఫలభోగమును కూకటివ్రేళ్ళతో పెళ్లగించివేయుదానా! నిత్యము అందరి దేహములందుండుదానా! వెంటనే గుర్తించబడినదానా! ఓ కుండలినీవిద్యాదేవతా! నా తల్లీ! మాయ అనియు క్రియా అనియు నామాంతరములు గలదానా! (లేక, మాయ యనదగు కార్యము గలదానా!), ఈ విధముగా సిద్ధకులమున జన్మించిన వారిచే యెవరెవరిచే భావించబడుచున్నదో, వారిచే నమస్కారములతోనూ శుభప్రదములైన మంచి స్తోత్రములతోను భావించబడుచున్నావు.

వాయువు, ఆకాశము నిర్మలమైనవి. శ్రీదేవి నివాసమైన చతుర్దళ పద్మము మూలాధారము కూడ నిర్మలమే. **సంకేతితా** = బీజాక్షరములచే సంకేతింపబడునది.

**శ్లో॥ ధాతాశంకరమోహినీత్రిభువనచ్ఛాయాపటోద్గామినీ**
**సంసారాదిమహాసుఖప్రహరిణీ తత్రస్థితా యోగినీ ।**

**సర్వగ్రంథివిభేదినీ స్వభుజగా సూక్ష్మాతిసూక్ష్మా పరా**
**బ్రహ్మజ్ఞానవినోదినీ కులకుటీ వ్యాఘాతినీ భావ్యతే ॥ 33**

**ప్రతిపదార్థం :** ధాతా = బ్రహ్మను, శంకర = శివుని, మోహినీ = మోహింపజేయునది, త్రిభువన = మూడు భువనముల, ఛాయాపట = వాతావరణమునకు, ఉద్ + గామినీ = పైగా వెడలునది, సంసారాది = సంసారసుఖము మొదలుగాగల, మహాసుఖ = గొప్ప సుఖములను, ప్రహరిణీ = తరిమికొట్టునది, తత్ర = మూలాధారమున, స్థితా = నెలకొన్నది!, యోగినీ = యోగిని!, సర్వ = అన్ని, గ్రంథి = గ్రంథులను, విభేదినీ = ఛేదించునది, స్వ = తనయొక్క, భుజ = భుజములపై, గా = నడచునది, (స్వ = స్వయముగా, భుజగా = సర్పరూపము గలది), సూక్ష్మాతిసూక్ష్మా = అమితసూక్ష్మరూపి, పరా = పరదేవత, బ్రహ్మ = బ్రహ్మమును గూర్చిన, జ్ఞాన = జ్ఞానమునందు, వినోదినీ = ఆనందించునది, కులకుటీ = కులస్థానమున వసించునది, వ్యాఘాతినీ = నశింపజేయునది, భావ్యతే = ధ్యానింపబడుచున్నది.

**తాత్పర్యం :** బ్రహ్మను, శంకరునిగూడ మోహింపజేయునది, త్రిభువనములపైన సంచరించునది, సంసారము మొదలగు మహాసుఖములను పోగొట్టునది, మూలాధారమున నుండునది, యోగిని, అన్ని ముడులను విడదీయునది, సర్పాకారము గలది, పరమసూక్ష్మరూపముగల పరాదేవత, బ్రహ్మజ్ఞానానందము గలది, కులమునందుండునది, విధ్వంసకశక్తియైన ఆ శ్రీదేవి ధ్యానింపబడుచున్నది.

**తత్ర,** అక్కడ, అంటే, మూలాధారంలో అని భావం. **గ్రంథి, ధియం స్వకాశ విమర్శశక్తిం గ్రసతి మాయా రూపేణ ఆచ్ఛాద్య ఇతి గ్రంథిః,** అను వ్యుత్పత్తిని బట్టి, వివేకాన్ని హరించివేసే మాయారూపమున నుండే ముడి. ఇవి బ్రహ్మగ్రంథి, విష్ణుగ్రంథి, రుద్రగ్రంథి, అని మూడు. ఈ ముడులు త్రెంచటం అంటే అహంకారం, భేదబుద్ధి నశించటం అని అర్థం.

**కులము** అంటే పృథ్వీతత్త్వం ముగిసే స్థానం. శ్రీదేవి ఈ స్థానంలో ఉంటుంది కనుక ఆమె కులకుటి.

**వ్యాఘాతినీ,** నాశకర్త్రి, అనటం ఎందుకంటే, ఆమె కరుణయే మానవునికి గ్రంథిత్రయభేదనం చేసే శక్తినిచ్చి బ్రహ్మజ్ఞానార్జనకు నాంది పలుకగలదు. ఈ సందర్భంలో శ్లో. 20 లోని **మృత్యుస్వరూపిణీమ్** అన్న దాని వివరణను స్మరించుకొనటం సముచితం.

**శ్లో॥ వందే శ్రీకులకుండలీత్రివలిభిః సాంగైః స్వయంభూం ప్రియం**
**ప్రావేష్ట్యాంబరమారచిత్తచపలా బాలాబలానిష్కలా ।**
**యా దేవీ పరిభాతి వేదవదనా సంభావినీ తాపినీ**
**ఇష్టానాం శిరసి స్వయంభువనితాం సంభావయామి క్రియామ్ ॥ 34**

**ప్రతిపదార్థం :** యా దేవీ = ఏ దేవి, స్వయంభూమ్ = స్వయంభువైన, ప్రియమ్ = ప్రియుని, శ్రీకులకుండలీ = మూలాధారమునగల కుండలినీశక్తి యొక్క రూపమున, త్రివలిభిః = మూడు చుట్లచే, సాంగైః = అంగములన్నిటితో, ప్రావేష్ట్య = పెనవేసికొన్న, అంబర = వస్త్రమై, మారచిత్త = మన్మథబుద్ధివలన, చపలా = చపలమైనదై, బాలా = బాలయై, అబలా = అబలయై, నిష్కలా = నిష్కలయై, వేదవదనా = వేదముఖియై, సంభావినీ = సౌందర్యవతియై, తాపినీ = తపింపజేయునదియై, పరిభాతి = ప్రకాశించుచున్నదో, (తాం = అట్టి), క్రియాం = క్రియారూపిణియైన, సృష్టిశక్తిరూపిణి యైన, ఇష్టానామ్ = భక్తులయొక్క, శిరసి = శిరస్సుపై, స్వయంభు = స్వయముగా వెలయువాని యొక్క, వనితాం = ఇల్లాలిని, సంభావయామి = ధ్యానించుచున్నాను, వందే = నమస్కరించుచున్నాను.

**తాత్పర్యం :** ఏ శ్రీదేవి క్రియాశక్తియై భక్తుల శిరస్సుపై స్వయముగా వెలయు శివుని లేక భైరవుని ఇల్లాలో ఆమెను గౌరవించి నమస్కరించుచున్నాను. ఆ దేవి స్వయంభూలింగమైన తన ప్రియుని తన అంగములన్నిటితో ముమ్మారు చుట్టుకొని, పెనవేసికొన్న వస్త్రమై కామచాంచల్యముగల బాలా రూపిణి, నిరవయవి. ఆమెకు వేదములే ముఖము లేక ఆమె ముఖమునుండియే వేదములు శ్రుతులైనవి. ఆమె సౌందర్యవతి. తపింపజేయునది.

**బాలాబలా** అన్నదానిని, **బాలా+అబలా** అని పదవిభాగముజేసి సవర్ణదీర్ఘముగ పరిగణింపవచ్చును. లేక, **బాలా చ బలా** అని ద్వంద్వముగ పరిగణింప వచ్చును. ఇట్లయిన, ఆమె అబలకాదు, సబల యగును. స్త్రీరూప అన్న అర్థమున అబల సరి. శక్తి కనుక **బలా** అన్ననూ సరియే.

**కల** (లేక కళ) అంటే భాగము అని అర్థము. కనుక **నిష్కలా** అంటే అవిభక్తము అని అర్థము. కళ అంటే వ్యక్తసంకేతము అని సాంకేతికార్థం. ఈ వ్యక్తత వ్యష్టి కావచ్చు, సమష్టి కావచ్చు. ప్రధానకళలు అయిదుగా చెప్పబడినవి : 1. శాంత్యతీతము, అను ఆకాశశక్తి, 2. శాంతి అను వాయుశక్తి, 3. విద్యా అను తేజశ్శక్తి, 4. ప్రతిష్ఠా

అను ఆపశ్శక్తి, 5. నివృతి అను పృథ్వీశక్తి. ఇవన్నీ నాదమునుండి పుట్టినవే. ఇవి పంచభూతశక్తుల వ్యక్తరూపమున కళలైనవి. ఇవన్నీ వికసనములేని దశలో నాదమున్నది కదా, అది నిష్కలము. ఈ నాదశక్తియే **వేదవదనా** అన్నది.

**శ్లో॥ వాణీ కోటిమృదంగనాదమదనానిశ్రేణికోటిధ్వనిః**
**ప్రాణేశీ రసరాశమూలకమలోల్లాసైకపూర్ణాననా ।**
**ఆషాఢోద్భవమేఘవాజనియుతధ్వాన్తాననా స్థాయినీ**
**మాతా సా పరిపాతు సూక్ష్మపథగా మాం యోగినాం శంకరీ ॥ 35**

**ప్రతిపదార్థం :** సూక్ష్మపథగా = సూక్ష్మమార్గమున సంచరించునట్టిది, యోగినామ్ = యోగులకు, శంకరీ = శుభమును కలిగించునట్టిది, స్థాయినీ = సర్వదా, సర్వత్ర ఉనికి గలిగినది, కోటిమృదంగనాదమదనా = కోటి మృదంగముల నాదముతో ఆనందింపజేయునట్టి, నిశ్రేణి = నిచ్చెనయొక్క, కోటి = పై అంచుననుండు, ధ్వనిః (అనగా, సర్వోత్తమమైన ధ్వని) = ధ్వనియైన, వాణీ = వాక్కుగలిగినది, ప్రాణ + ఈశీ > ప్రాణేశీ = ప్రాణములకు ఈశ్వరీ యైనది, రస = రసము, రాశ = రాశము, మూల = మూలము అయిన, కమల = పద్మము వంటి, ఉల్లాస + ఏక = ఆనంద మాత్రముచే, పూర్ణ = నిండిన, ఆననా = ముఖముగలది, ఆషాఢ = ఆషాఢమాసమున, ఉద్భవ = పుట్టిన, మేఘవాజ = మబ్బుగమియొక్క, నియుత = పదివేల కోట్లను పోలిన, ధ్వాన్త = నల్లని, ఆననా = ముఖముగలదియైన, సా మాతా = ఆ తల్లి, మామ్ = నన్ను, పరిపాతు = పరిరక్షించుగాక!

**తాత్పర్యం :** సూక్ష్మమార్గంలో సంచరించునది, యోగులకు శుభముగూర్చునది, సర్వదా సర్వత్ర ఉన్నది, అత్యుత్తమమైన కోటి మృదంగముల నాదముతో ఆనందింపజేయు ధ్వనితోడి వాక్కు గలది, ప్రాణములకు ఈశ్వరియైనది, రసము రాశము మూలము అయిన ఆనందముతో నిండిన పద్మముఖి, ఆషాఢ మాసపు పదివేలకోట్ల మబ్బుగుంపులకు సరియైన నల్లని ముఖము గలది, అట్టి ఆ తల్లి నన్ను పరిరక్షించును గాక!

**కోటి** శబ్దానికి సంఖ్యాపరమైన అర్థంతో పాటు వేరే అర్థాలున్నాయి. వానిలో సర్వోత్తమము అన్న అర్థం ఒకటి, అంచు అన్నది మరియొకటి. **నిశ్రేణి** అంటే నిచ్చెన. కనుక **నిశ్రేణికోటి** అన్నప్పుడు నిచ్చెనపై అంచు, అనగా సర్వోత్తమ అన్న అర్థం యేర్పడుతుంది. ఈ సర్వోత్తమ ధ్వనియే ఆ శ్రీదేవి వాణి, అనగా నాదరూపి.

ప్రాణాధారము, మూలాధారము ఆ తల్లియే కనుక **ప్రాణేశీ.** ఈ ఆధారము కమలము రూపంలో మూలాధారమై జీవులలో ఉండేది. దీని అనుభవరూపము **రసము, రాశము** అని రెండు విధాలు. రసము అంటే, **రస్యతే ఇతి రసః** అన్న వ్యుత్పత్తిని బట్టి, ఇది ఆస్వాదింపబడునది, ఆనందరూపము, ఇది పరమాత్మరూపము. **రాశము** అన్నది **రాసము** అనుదాని రూపాంతరము. కాగా రాశము రస సంబంధి. అంటే, రసోత్పత్తికి ఆధారమైనదేదో అది. రసానుభవమునకు, రసోత్పత్తికి కూడ మూలమైన జీవశక్తి **మూలము** అన్నదానికి అర్థం. ఈ శక్తి కమలరూపమైన ఆధారపద్మం లేక చక్రంలో ఆత్మానందసమాధిలో ఉంటుంది కనుక **ఉల్లాసైకపూర్ణాననా.**

ఈమె కాలస్వరూపిణి కాళి కనుక కారుమబ్బులగుంపులు దట్టంగా పట్టిన కారునలుపు ఆమె రంగు.

**పరిపాతు** అనటంలో ఐహిక, ఆముష్మికములు రెండిట ఆ తల్లి రక్షణావశ్యకత ధ్వనిస్తుంది.

**గమనిక :** 4వ పాదంలో, అన్వయసౌలభ్యం కోసం, సూక్ష్మపథగా అనిన్నీ, శంకరీ అనిన్నీ మార్చటం జరిగింది. మన్నించ ప్రార్థన.

**శ్లో॥ త్వామాశ్రిత్య నరా వ్రజన్తి సహసా వైకుంఠకైలాసయో -**
**రానందైకవిలాసినీం శశిశతానందాననాం కారణామ్ ।**
**మాతః శ్రీకులకుండలీప్రియకరే కాలీ కులోద్దీపనే**
**తత్స్థానం ప్రణమామి భద్రవనితే మాముద్ధర త్వం పశుమ్ ॥ 36**

**ప్రతిపదార్థం :** ఆనంద + ఏక = ఆనందమొక్కటే, విలాసినీమ్ = విలాసముగా గలదానిని, శశిశత = నూర్గురు చంద్రుల, ఆనంద + ఆననామ్ = ఆనందముతో వెలుగు ముఖముగలదానిని, కారణామ్ = జగత్తునకు కారణమగుదానిని, త్వామ్ = నిన్ను, ఆశ్రిత్య = ఆశ్రయించి, నరాః = మానవులు, సహసా = వెంటనే, వైకుంఠకైలాసయోః = వైకుంఠమునకు, కైలాసమునకు, వ్రజన్తి = వెళ్ళుచున్నారు, శ్రీకుల కుండలీమాతః = శ్రీకులకుండలినీమాతా!, ప్రియకరే = ప్రియము చేయుదానా!, కుల + ఉద్దీపనే = కులమును వెలుగొందజేయుదానా!, భద్రవనితే కాలీ = భద్రకాళీ!, తత్స్థానం = నీయొక్క స్థానమును, ప్రణమామి = నమస్కరించుచున్నాను, త్వమ్ = నీవు, పశుం మామ్ = పశువునైన, జీవినైన నన్ను, ఉద్ధర = ఉద్ధరించుము.

**తాత్పర్యం :** ఆనందమొక్కటే విలాసమైనది, సూర్యగురు చంద్రుల తేజస్సుతో ఆనందముగా వెలుగొందు ముఖము గలది, సృష్టికి ఆదికారణమైనదానిని, నిన్ను ఆశ్రయించి మానవులు వెంటనే వైకుంఠకైలాసములను చేరుచున్నారు. శ్రీదేవీ! కుండలినీదేవతా! మాకు ప్రియముజేయు తల్లీ! భద్రకాళీ! కులమునుద్దీపింపజేయుదానా! నీ మూలస్థానమును నమస్కరించుచున్నాను. పశువునైన నన్నుద్ధరింపుము.

**వైకుంఠకైలాసయోః ప్రజన్తి,** వైకుంఠకైలాసములకు పోవుచున్నారు, అంటే విష్ణుని ఆరాధ్యునిగా భావించి కుండలినీ దేవతనుపాసించినవారు వైకుంఠానికి పోగా, శివునారాధించువారు కైలాసానికి పోతారని భావం. అంటే, **శైవ వైష్ణవులిద్దరికీ కుండలినీ ఉపాస్యమని ఉద్దేశం.**

విలాసము గలది విలాసిని. విలాసం అంటే మిగత అర్థాలతోబాటు సౌందర్యమని కూడా అర్థం. శ్రీదేవి విషయంలో ఆనందసౌందర్యాలు అభేదమని చెప్పటానికే **ఏక**శబ్దప్రయోగం.

ప్రకృతి కార్యకారణరూపమైనది. బాహ్య పదార్థప్రకృతి కార్యము కాగా దీనికి కారణము అంతశ్శక్తి. కనుక కుండలినీదేవత సమస్తసృష్టికి మొదటి కారణము.

**శ్లో॥ కుండలీశక్తిమార్గస్థం**
**స్తోత్రాష్టకమహాఫలమ్ ।**
**యః పఠేత్ ప్రాతరుత్థాయ**
**స యోగీ భవతి ధ్రువమ్ ॥ 37**

**ప్రతిపదార్థం :** కుండలీశక్తిమార్గస్థమ్ = కుండలినీశక్తి ఉపాసనామార్గములోనిదైన, స్తోత్రాష్టకమహాఫలమ్ = గొప్ప ఫలమునిచ్చు స్తోత్రమైన ఈ అష్టకమును, ప్రాతః = ప్రాతఃకాలమున, ఉత్థాయ = నిద్రమేల్కొని, యః = ఎవడు, పఠేత్ = పఠించునో, సః = అతడు, ధ్రువమ్ = నిశ్చయముగా, యోగీ = యోగి, భవతి = అగుచున్నాడు.

**తాత్పర్యం :** కుండలినీ శక్తి నుపాసించే విధానంలో మహాఫలము నివ్వగల ఈ స్తోత్రరూపమున గల అష్టకాన్ని ఎవరు ప్రాతఃకాలమున నిద్రలేచి పఠించునో, ఆతడు యోగి అగును. ఇది నిశ్చయము.

ఇదిన్నీ తర్వాతి శ్లోకమున్నూ ఫలశ్రుతి రూపమైనది.

ఈ కుండలినీ స్తోత్రాన్ని అష్టకం, అంటే, ఎనిమిది శ్లోకాల సమాహారం

అనటం వలన శ్లో. 29 నుండి 36 వరకు గల 8 శ్లోకాలు కుండలినీ అష్టకం అవుతుంది.

**శ్లో॥ క్షణాదేవ హి పాఠేన**
**కవినాథో భవేదిహ ।**
**పఠేత్ శ్రీకుండలో యోగో**
**బ్రహ్మలీనో భవేత్ మహాన్ ॥ 38**

**ప్రతిపదార్థం :** క్షణాత్ + ఏవ = క్షణమాత్రమైన, పాఠేన హి = పఠనముతోనే, ఇహ = ఈ లోకంలో, కవినాథః = కవులలో శ్రేష్ఠుడు, భవేత్ = అగును. శ్రీకుండలః = శ్రీకుండలినీ ఉపాసనతో కూడిన, మహాన్ = గొప్ప, యోగః = యోగముగలవాడు (యోగి), పఠేత్ (యది) = పఠించినచో, (సః = ఆతడు), బ్రహ్మలీనః = బ్రహ్మమున లీనము, భవేత్ = అగును.

**తాత్పర్యం :** ఒక్క క్షణకాలము మాత్రమే పఠించిన వాడైనను కవిరాజు కాగలడు. శ్రీచక్రోపాసకుడైన మహాయోగి పఠించినట్లయిన, ఆతడు బ్రహ్మము నందు లీనమగును.

లౌకిక ప్రయోజనం ఆశించకున్నా సిద్ధిస్తుందని ఈ శ్లోక పూర్వార్ధభావం. లాంఛనమాత్రంగా పఠించినవానికైన వాక్శుద్ధి కలుగుతుందన్నది తాత్పర్యం. కాగా, పఠించిన వ్యక్తి కుండలినీ ఉపాసకుడైన యోగి అయితే, బ్రహ్మములో లీనమైపోతాడు, అంటే, జన్మరాహిత్యాన్నీ, బ్రహ్మానందాన్నీ శాశ్వతంగా పొందుతాడని తాత్పర్యం. మహాయోగిగా పరిణతి చెందినవానికి బ్రహ్మభావం తప్ప మిగిలి ఉన్నదేమీ ఉండదు కనుక ఈ పరమస్థితిని పొందగలడని భావం.

**శ్లో॥ ఇతి తే కథితం నాథ!**
**కుండలీకోమలం స్తవమ్ ।**
**ఏతత్ స్తోత్రప్రసాదేన**
**దేవేషు గురుగీష్పతిః ॥ 39**

**ప్రతిపదార్థం :** ఇతి = ఇట్లు, నాథ = ఓ స్వామీ!, తే = నీకు, కుండలీకోమలమ్ = కోమలమైన కుండలినీ, స్తవమ్ = స్తోత్రము, కథితమ్ = చెప్పబడినది, ఏతత్ = ఈ, స్తోత్ర = స్తోత్రముయొక్క, ప్రసాదేన = అనుగ్రహముచేత, దేవేషు = దేవతలలో, గురుగీష్పతిః = సృష్టికర్తయగు బ్రహ్మ, గురుః = గొప్పవాడు.

**తాత్పర్యం :** ఈ విధముగా నీకు కోమలమైన కుండలినీ స్తవము చెప్పబడినది, స్వామీ! ఈ స్తోత్రఫలితముగనే దేవతలలో బ్రహ్మ గొప్పవాడైనాడు.

**శ్లో॥ సర్వే దేవాః సిద్ధియుతాః**
**అస్యాః స్తోత్రప్రసాదతః ।**
**ద్విపరార్ధం చిరంజీవీ**
**బ్రహ్మా సర్వసురేశ్వరః ॥ 40**

**ప్రతిపదార్థం :** అస్యాః = ఈ, స్తోత్రప్రసాదతః = స్తోత్రము యొక్క అనుగ్రహమువలన, సర్వే దేవాః = దేవతలందఱు, సిద్ధియుతాః = సిద్ధులతో కూడినవారైరి, సర్వసుర + ఈశ్వరః = దేవతలందఱకు ప్రభువైన, బ్రహ్మా = బ్రహ్మ, ద్విపరార్ధమ్ = రెండు పరార్ధముల కాలము, చిరంజీవీ = ఆయువుగలవాడాయెను.

**తాత్పర్యం :** ఈ స్తోత్రప్రభావం వలన సిద్ధులను పొందిన దేవతలందఱకు స్వామియైన బ్రహ్మ ద్విపరార్ధకాలము ఆయువుగలవాడాయెను.

**ద్విపరార్ధం** అంటే ఒక రాత్రి, ఒక పగలు కాలము. బ్రహ్మకు ఒక పగలు 432000000 మానుష సంవత్సరాలు. అట్లే ఒక రాత్రి 4320000000 మానుష సంవత్సరాలు వెరశి, ఒక రోజు 8640000000 మానుష సంవత్సరాలు. ఇది బ్రహ్మకల్ప ప్రమాణంగా చెప్పబడినది. ఇదే ద్విపరార్ధకాలము.

**శ్లో॥ త్వష్టాపి మమ నికటే**
**స్థితో భగవతీపతిః ।**
**మాం విద్ధి పరమాం శక్తిం**
**స్థూలసూక్ష్మస్వరూపిణీమ్ ॥ 41**

**ప్రతిపదార్థం :** స్థూలసూక్ష్మస్వరూపిణీమ్ = స్థూలపదార్థప్రకృతిగను, సూక్ష్మశక్తి రూపిణిగను ఉన్న, మామ్ = నన్ను, పరమామ్ = అత్యున్నత, అత్యుత్తమ, సర్వోత్తమ, శక్తిమ్ = శక్తినిగా, విద్ధి = తెలిసికొనుము. (అట్లు తెలిసికొనుటచేతనే), త్వష్టా = విశ్వకర్మ, భగవతీపతిః అపి = సదాశివుడు కూడా, మమ = నాయొక్క, నికటే = సమీపమున, స్థితః = ఉన్నాడు. (త్వష్టా స్థితః భగవతీపతిః అపి, అని అన్వయం కనుక ఏకవచనప్రయోగం.)

**తాత్పర్యం :** ఈ స్థూలప్రకృతిరూపంలోనూ, కంటికి కనరాని సూక్ష్మరూపవిశ్వంలోనూ

అంతర్వాహినిగా ఉన్న శక్తిని నేనే. నేనే చరమమును, పరమమును. ఇట్లని తెలిసికొనుము. ఈ జ్ఞానమున్నందువలననే విశ్వకర్మ యైనను, భగవతీపతియైన సదాశివుడైనను నన్ను చేరగలిగినారు.

శక్తి – పదార్థములభేదమని నేటి విజ్ఞానశాస్త్రము ఘోషించు విషయమునే ఈ శ్లోకము ప్రస్తావించినది.

శ్లో॥ సర్వప్రకాశకారణీం
వింధ్యపర్వతవాసినీమ్ ।
హిమాలయసుతాం సిద్ధాం
సిద్ధమన్త్రస్వరూపిణీమ్ ॥ **42**

శ్లో॥ వేదాంతశక్తితంత్రస్థాం
కులతంత్రార్థగామినీమ్ ।
రుద్రయామల మధ్యస్థాం
స్థితిస్థాపకభావినీమ్ ॥ **43**

శ్లో॥ పంచముద్రాస్వరూపాం చ
శక్తియామలమాలినీమ్ ।
రత్నమాలావలీకోట్యాం
చంద్రసూర్యప్రకాశినీమ్ ॥ **44**

శ్లో॥ సర్వభూతమహోబుద్ధి-
దాయినీం దానవాపహామ్ ।
స్థిత్యుత్పత్తిలయకారీం
కరుణాసాగరస్థితామ్ ॥ **45**

శ్లో॥ మహామోహనివాసాఢ్యాం
దామోదరశరీరగామ్ ।
ఛత్రచామరరత్నాఢ్యాం
మహాశూలకరాం పరామ్ ॥ **46**

శ్లో॥ జ్ఞానదాం వృద్ధిదాం జ్ఞాన-
రత్నమాలాకలాపదామ్ ।

సర్వతేజఃస్వరూపాభా-
మనంతకోటివిగ్రహామ్ ॥ **47**

శ్లో॥ దరిద్రధనదాం లక్ష్మీం
నారాయణమనోరమామ్ ।
సదా భావయ శంభో త్వం
యోగనాయకపండిత ॥ **48**

**ప్రతిపదార్థం :** శంభో = ఓ శివా!, యోగనాయక పండిత = యోగమునకు నియామకుడవైన ఓ పండితుడా!, త్వమ్ = నీవు, సదా = ఎల్లవేళలందు, సర్వప్రకాశకారణీమ్ = అన్ని వెలుగులకు జన్మస్థానమైన, వింధ్యపర్వతవాసినీమ్ = వింధ్యపర్వతమున నివసించునట్టి, హిమాలయసుతామ్ = హిమవంతుని కుమార్తెయైన, సిద్ధ = సిద్ధించిన, మంత్రస్వరూపిణీమ్ = మంత్రమే రూపముగాగల, సిద్ధామ్ = సిద్ధురాలను, వేదాంత = వేదాంతము, శక్తితంత్రస్థామ్ = శక్తితంత్రములందున్నదానిని, కులతంత్ర= కౌలాచారమునకు మూలమైన కులతంత్రముయొక్క, అర్ధగామినీమ్ = అర్ధస్వరూపమైనదానిని, రుద్రయామల మధ్యస్థామ్ = రుద్రయామలము మధ్య భాగమున నుండుదానిని, స్థితిస్థాపకభావినీమ్ = స్థితిస్థాపకభావరూపమైనదానిని, పంచముద్రాస్వరూపాం చ = పంచముద్రల రూపముగలదానిని, మఱియు, శక్తియామలమాలినీమ్ = శక్తియామల మాల ధరించిన దానిని, రత్నమాలావలీకోట్యామ్ = రత్నమాలల కోటియందు, చంద్రసూర్య ప్రకాశినీమ్ = చంద్ర సూర్యులను ప్రకాశింపజేయుదానిని, సర్వభూత = భూతములన్నిటికి, మహా = గొప్ప బుద్ధిదాయినీమ్ = బుద్ధినిచ్చుదానిని, దానవ = దానవులను, అపహామ్ = నశింపజేయుదానిని, స్థితి + ఉత్పత్తిలయకారీమ్ = సృష్టిస్థితిలయములను కలిగించు దానిని, కరుణాసాగరస్థితామ్ = కరుణాసముద్రములో నుండు దానిని, మహామోహనివాస + ఆఢ్యామ్ = మహామోహము అను గృహమున నుండు గొప్పదానిని, దామోదరశరీరగామ్ = విష్ణుశరీరవాసిని, ఛత్రచామరరత్నాఢ్యామ్ = ఛత్రము, చామరము, రత్నహారములు అను రాజలాంఛనములు ధరించుదానిని, మహాశూలకరామ్ = చేతిలో గొప్ప శూలమును ధరించినదానిని, పరామ్ = పరదేవతను, జ్ఞానదామ్ = జ్ఞానమిచ్చుదానిని, వృద్ధిదామ్ = వృద్ధినిచ్చుదానిని, జ్ఞానరత్నమాలాకలాపదామ్ = జ్ఞానమను రత్నమాలలను అనేకముగా ఇచ్చుదానిని,

సర్వతేజః స్వరూపాభామ్ = సమస్త తేజస్సుల స్వరూపమైన కాంతితో ప్రకాశించుదానిని, అనంతకోటివిగ్రహామ్ = అసంఖ్యాకమైన శరీరములు గలదానిని, దరిద్ర = దరిద్రులకు, ధనదామ్ = ధనమిచ్చుదానిని, నారాయణ = విష్ణుని, మనోరమామ్ = మనస్సును రంజింపజేయు, లక్ష్మీమ్ = శ్రీదేవిని, త్వమ్ = నీవు, భావయ = ధ్యానించుము.

**తాత్పర్యం :** హే శంభో! నీవు యోగనాయక పండితుడవు. సర్వప్రకాశకారిణి, వింధ్యపర్వతవాసిని, హిమవత్పుత్రి, సిద్ధమంత్రస్వరూపిణియైన సిద్ధురాలు, వేదాంత శక్తితంత్రస్థ, కులతంత్రసారమైన రుద్రయామలమధ్యస్థ, స్థితిస్థాపకభావిని, పంచముద్రాస్వరూపిణి, శక్తియామలమాలాధారిణి, రత్నమాలావలీకోటిధారిణి, చంద్రసూర్యులను ప్రకాశింపజేయునది, సర్వభూతములకు మహత్వపూర్ణమైన బుద్ధిని ప్రసాదించునది, దానవనాశని, సృష్టిస్థితిలయములను చేయునది, కరుణాసాగరవాసిని, దామోదరశరీరములో మహామోహనివాసిని, ఛత్రచామరరత్నధారిణి, మహాశూలధారిణి, పరదేవత, జ్ఞానప్రద, వృద్ధికారిణి, జ్ఞానరత్నమాలా కళలకు స్థానమైనది, అన్ని విధముల తేజోమూర్తుల స్వరూప ప్రకాశిని, అసంఖ్యాకమైన రూపములను కలిగినది, దరిద్రులకు ధనమిచ్చునది, నారాయణుని మనస్సును రంజింపజేయునది యైన మహాలక్ష్మీదేవిని ఎల్లవేళల భావింపుము.

**సర్వప్రకాశ** అనటం వలన, పదార్థప్రకాశము, ఇంద్రియజ్ఞానప్రకాశము, బుద్ధివివేకప్రకాశము, సుజ్ఞానప్రకాశము, ప్రతిఫలనప్రకాశము ఇత్యాది విభిన్న ప్రకాశములు ఉద్దిష్టములని గ్రాహ్యర్థం.

**సిద్ధమంత్ర** మనగా, మంత్రముచే సిద్ధించినదని భావము. కేవలము శక్తియై అరూపముగా నుండు ఆ దేవత మంత్రముచే ఆవాహనముచేయబడినప్పుడు ఆ మంత్రబీజాక్షరముల అర్థము ననుసరించి రూపమును దాల్చి ప్రత్యక్షమగునని భావము.

**సిద్ధాం** అనగా సిద్ధిపొందినది, సిద్ధించినది. పార్వతి శివత్వసిద్ధిని కఠోరతపః ప్రభావంవలన పొంది శివా అయినది. కాగా ఆమె భక్తివలన సిద్ధించునది. కనుక రెండు అర్థములలోను ఆమె **సిద్ధ** అనదగినదే.

ఆ దేవతనుపాసించువారికి వేదాన్తమార్గము, శక్తిమార్గము, తంత్రమార్గము అను అన్నిటా ప్రసన్నురాలగు దేవత కనుక ఆమె **వేదాంతశక్తితంత్రస్థ.**

కౌలాచారము, వామాచారము అనునవి శాక్తేయసంప్రదాయములు. వీనిలో **కౌలతంత్రార్థగామిని** కుండలినీ దేవత. అనగా, కౌలతంత్రములో భాగమైన కుండలినీ ఉపాసకుల కారాధ్యదేవత. ఆమె తత్త్వమే కౌలతంత్రసారము.

**రుద్రయామలమధ్యస్థ :** రుద్రశబ్దాన్ని శివపరంగా చెప్పటం పరిపాటి. కాని రుద్రులు పదకొండుమంది : 1. అజుడు, 2. ఏకపాదుడు, 3. అహిర్బుధ్న్యుడు, 4. త్వష్ట, 5. రుద్రుడు, 6. హరుడు, 7. శంభుడు, 8. త్ర్యంబకుడు, 9. అపరాజితుడు, 10. ఈశానుడు, 11. త్రిభువనుడు. వీనిలో మధ్యస్థుడు హరుడు. వానిశక్తి ఈ దేవత. కనుక ఆమె హరణశక్తి.

**స్థితిస్థాపకభావినీ :** స్థితి అంటే ఉనికి. దాన్ని సాధ్యం చేసే క్రియ స్థాపన. ఈ క్రియకొక కర్త ఉండాలి. ఆ కర్త స్థితిస్థాపకుడు. ఆ కర్తలోని శక్తి స్థితిస్థాపక భావము. ఆ శక్తిరూపదేవత స్థితిస్థాపకభావిని.

**పంచముద్రాస్వరూపా :** పంచముద్రలు : 1. ఆవాహని, 2. స్థాపని, 3. సన్నిధాపని, 4. సంబోధని, 5. సమ్ముఖీకరణి. ఇవి దేవతార్చనలో చేయదగినవి. ఈ అయిదింటి సమాహారస్వరూపమే శ్రీదేవి, శ్రీచక్రదేవత.

**శక్తియామలమాలినీ :** శక్తి మూడు విధాలు : 1. ప్రభుశక్తి, 2. మంత్రశక్తి, 3. ఉత్సాహశక్తి. ఈ మూడిటిని కలిపి శక్తియామలమనవచ్చు. వీనిని శివునితో జతగూర్చిన శివ–శక్తి యామలమగును.

**మహామోహనివాసాఢ్యా** అనునది శ్రీదేవియొక్క మాయా స్వరూపమును సూచించునది.

***పశుభావప్రశంసా :***

**శ్లో॥ పునర్భావం పశోరేవ**
**శృణు సాదరపూర్వకమ్ ।**
**అకస్మాత్ సిద్ధిమాప్నోతి**
**పశుర్నారాయణోపమః ॥ 49**

**ప్రతిపదార్థం :** పునః = ఇంక, పశోః = పశువుయొక్క, భావం ఏవ = భావమునే, సాదరపూర్వకమ్ = ఆదరముతో, శృణు = వినుము. నారాయణ = నారాయణునితో, ఉపమః = పోల్చదగిన, పశుః = జీవుడు, అకస్మాత్ = హఠాత్తుగా, సిద్ధిమ్ = సిద్ధిని,

ఆప్నోతి = పొందుచున్నాడు.

**తాత్పర్యం :** ఇపుడింక పశుభావమును గురించి ఆదరముతో వినుము. పశువు, అంటే జీవుడు నారాయణునితో పోల్చదగినవాడు. అతడు హఠాత్తుగా సిద్ధిని పొందుచున్నాడు.

జీవుడు జంతుప్రాయుడుమాత్రమే కాడు. నరుడు కనుక నారాయణసముడు. నారము అంటే జ్ఞానమని అర్థం. అయనం అంటే మార్గం. నారాయణుడంటే జ్ఞానమార్గం అని అర్థం. కాగా, జ్ఞానమార్గంలో సాగే నరుడు నారాయణసముడవుతాడు. కనుకే ఆతడు సిద్ధిని పొందటం సహజం. అది వేగంగా జరుగుతుంది అనటానికి **అకస్మాత్** అన్నపదం. ప్రయత్నం, సాధన అక్కర్లేదని కాదు. వాటికి వేగంగా ఫలం లభిస్తుందని భావం.

**శ్లో॥ వైకుంఠనగరే యాతి**
**చతుర్భుజకలేవరః ।**
**శంఖచక్రగదాపద్మ-**
**హస్తో గరుడవాహనః ॥ 50**

**ప్రతిపదార్థం :** చతుర్భుజకలేవరః = చతుర్భుజములున్న దేహముగలవాడై, శంఖచక్ర గదాపద్మహస్తః = శంఖము, చక్రము, గద, పద్మము అను నాలుగింటిని తన నాలుగు చేతులలో ధరించినవాడై, గరుడవాహనః = గరుత్మంతుడు వాహనం కాగా, వైకుంఠనగరే = వైకుంఠపురములోనికి, యాతి = పోవుచున్నాడు.

**తాత్పర్యం :** నారాయణుని పోలిన నరుడు నారాయణుని వలెనే చతుర్భుజుడై, శంఖచక్రగదాపద్మహస్తుడై, గరుడవాహనుడై వైకుంఠపురమునకు పోవును.

ఇక్కడ సారూప్యముక్తి ప్రస్తావితము.

**శ్లో॥ మహాధర్మస్వరూపోఽసౌ**
**మహావిద్యాప్రసాదతః ।**
**పశుభావం మహాభావం**
**భావానాం సిద్ధిదం పునః ॥ 51**

**ప్రతిపదార్థం :** అసౌ = ఆతడు, మహాధర్మస్వరూపః = మహాధర్మమూర్తి, మహావిద్యా = శ్రీవిద్యయొక్క, ప్రసాదతః = అనుగ్రహమువలన అగును; పశుభావమ్ = పశు

భావము, భావానామ్ = భావములకు, పునః = తరువాత, సిద్ధిదమ్ = సిద్ధిని కలిగించు, మహాభావమ్ = మహాభావము.

**తాత్పర్యం :** శ్రీవిద్యోపాసకుడు శ్రీవిద్యాదేవత అనుగ్రహము వలన మహాధర్మమూర్తి కాగలడు. పశుభావము, తరువాత అన్యభావములను సిద్ధింపచేయు మహాభావము.

ఉత్తమభావములుగా చెప్పబడు వీరభావమును గాని దివ్యభావమునుగాని పొందుటకు ప్రాతిపదిక పశుభావము, అనగా జీవభావము. జీవుడు కాకున్న దేవుడు కాలేడు. ముందటి శ్లోకంతో సమన్వయించినచో, ఈ పశుభావములోని జీవుడు నరుడు, అన్యజీవులు కావు. కనుక మానవత్వమే దివ్యత్వమునకు యోగ్యమైనదని తాత్పర్యము.

**శ్లో॥ ఆదౌ భావం పశోః కృత్వా**
**పశ్చాత్ కుర్యాదవశ్యకమ్ ।**
**వీరభావం మహాభావం**
**సర్వభావోత్తమోత్తమమ్ ॥ 52**

**ప్రతిపదార్థం :** ఆదౌ = మొదట, ఆవశ్యకమ్ = తప్పక చేయదగినదైన, పశోః = పశువుయొక్క, భావమ్ = భావమును, కృత్వా = చేసి, పశ్చాత్ = తరువాత, సర్వభావ = అన్నిభావములలో, ఉత్తమోత్తమమ్ = అత్యుత్తమమైన, మహాభావమ్ = మహాభావమైన, వీరభావం = వీరభావమును, కుర్యాత్ = చేయవలెను.

**తాత్పర్యం :** మొదట అవశ్యముగా పశుభావమును చేసి, తరువాత అన్ని భావములలో అత్యుత్తమమైన వీరభావమును చేయవలెను. అది మహాభావము.

**శ్లో॥ తత్పశ్చాదతిసౌందర్యం**
**దివ్యభావం మహాఫలమ్ ।**
**ఫలాకాంక్షీ మోక్షగశ్చ**
**సర్వభూతహితే రతః ॥ 53**

**ప్రతిపదార్థం :** తత్ పశ్చాత్ = ఆపైన, మహాఫలమ్ = మహాఫలమైన, మహాఫలము నిచ్చు, అతిసౌందర్యమ్ = అత్యంతసుందరమగు, దివ్యభావం = దివ్యభావమును, ఫలాకాంక్షీ = ఫలముకోరువాడు, మోక్షగః = మోక్షము పొందగోరువాడు, సర్వ = అన్ని, భూత = భూతముల, హితే = శ్రేయస్సులో, రతః = ఆసక్తిగలవాడు (ఆశ్రయించవలెను).

**తాత్పర్యం :** సర్వప్రాణులకు మంచిని కోరునట్టివాడు, మహాఫలమైన మోక్షమును కోరు ఫలాపేక్షగలవాడు, ఆ తరువాత మహాఫలమునిచ్చునట్టి, ఉత్తమ సౌందర్యముగల దివ్యభావమును ఆశ్రయించవలెను.

**శ్లో॥ విద్యాకాంక్షీ ధనాకాంక్షీ**
**రత్నాకాంక్షీ చ యో నరః ।**
**కుర్యాద్ భావత్రయం దివ్యం**
**భావసాధనముత్తమమ్ ॥ 54**

**ప్రతిపదార్థం :** విద్యాకాంక్షీ = విద్యలను కోరువాడు, ధనాకాంక్షీ = ధనము కోరువాడు, రత్నాకాంక్షీ చ = రత్నసంపదను కోరువాడున్ను, యః + నరః = నరుడెవడో, (ఆతడు) భావసాధనం + ఉత్తమమ్ = ఉత్తమభావసాధనయైన, దివ్యమ్ = దివ్యమైన, భావత్రయం = మూడు భావములను, కుర్యాత్ = చేయవలెను.

**తాత్పర్యం :** విద్య, ధనము, రత్నరాశులు, వీనిని కోరు నరులు దివ్యమైన భావత్రయాన్ని ఆశ్రయించటం భావసాధనలో ఉత్తమమైనది.

**శ్లో॥ భావేన లభతే వాద్యం**
**ధనం రత్నం మహాఫలమ్ ।**
**కోటిగోదానజైః పుణ్యైః**
**కోటిశాలగ్రామదానజైః ॥ 55**

**శ్లో॥ వారాణస్యాం కోటిలింగ-**
**పూజనేన చ యత్ఫలమ్ ।**
**తత్ఫలం లభతే మర్త్యః**
**క్షణాదేవ న సంశయః ॥ 56**

**ప్రతిపదార్థం :** భావేన = భావముచేత, ఆద్యమ్ = ప్రాపంచికమైన, ధనమ్ = ధనము, రత్నమ్ = రత్నము, వా = లేక, మహాఫలం = మోక్షము, లభతే = లభించును. యత్ ఫలమ్ = ఏ ఫలము, కోటిగోదానజైః = కోటి గోవులను దానము చేయుటచే కలిగినట్టిది, కోటిశాలగ్రామదానజైః = కోటి సాలగ్రామములు దానమిచ్చుటచే కలిగినది, వారాణస్యామ్ = కాశీలో, కోటిలింగపూజనేన = కోటి లింగములను పూజించుటచేతను కలిగిన, పుణ్యైః = పుణ్యమూర్తులచేత,

(పొందబడునో), తత్ ఫలమ్ = ఆ ఫలమును, క్షణాత్ ఏవ = క్షణములోనే, మర్త్యః = మానవుడు, లభతే = పొందును, న సంశయః = సందేహములేదు.

**తాత్పర్యం :** ప్రాపంచికమైన ధనమూ రత్నరాశులూ, మహాఫలమైన మోక్షము కూడా భావము చేతనే లభించును. గోదానములు కోటి, సాలగ్రామదానములు కోటి, కాశీలో లింగపూజలు కోటి చేయగా యే ఫలం లభిస్తుందో, అదే ఫలాన్ని మానవుడు క్షణంలోనే నిస్సంశయంగా భావము చేతనే పొందును.

**శ్లో॥ ఆదౌ దశమదండే తు**
**పశుభావమథాపి వా ।**
**మధ్యాహ్నే దశదండే తు**
**వీరభావముదాహృతమ్ ॥ 57**

**శ్లో॥ సాయాహ్నదశదండే తు**
**దివ్యభావం శుభప్రదమ్ ।**
**అథవా పశుభావస్థో**
**యజేదిష్టాదిదేవతామ్ ॥ 58**

**ప్రతిపదార్థం :** ఆదౌ = మొదట, ప్రారంభములో, దశమదండే తు = దశమ దండముననేమో, పశుభావమ్ = పశుభావము, అథాపి వా = లేనట్లయితే, మధ్యాహ్నే = మధ్యాహ్నమున, దశదండే తు = దశదండముననేమో, వీరభావమ్ = వీరభావము, సాయాహ్నదశదండే తు = సాయంకాలపు దశదండమున నేమో, శుభప్రదమ్ = శుభమునిచ్చు, దివ్యభావమ్ = దివ్యభావము, ఉదాహృతమ్ = చెప్పబడినది. అథవా = లేకుంటే, పశుభావస్థః = పశుభావములోనుండి, ఇష్టదేవతామ్ = ఇష్టదేవతను, యజేత్ = పూజింపదగును.

**తాత్పర్యం :** ఉదయం పదిబారల కాలమేమో పశుభావానికి మధ్యాహ్నం పదిబారల కాలమేమో వీరభావానికి, సాయంత్రం పదిబారల కాలం శుభప్రదమైన దివ్యభావానికి చెప్పబడినది. లేకుంటే, పశుభావంలో ఉదయకాలాన తన ఇష్టదేవతను పూజించుకోవచ్చు.

**దండం** అంటే ఒక బార ప్రమాణం. కాలాన్ని కొలిచే ప్రమాణంగా వాడుకలో 'పదిబారల ప్రొద్దెక్కింది' అనటం కద్దు. అంటే మింట సూర్యుడు సాగిన దూరం.

ఉదయం నుండి సాయంత్రం దాటి అస్తమయం వరకు సూర్యగమనాన్ని బారలతో కొలిచి మొత్తం 30 బారలుగా లెక్కగట్టినారు పూర్వులు. మొదటి పది బారలు ఉదయం, తర్వాతి పది మధ్యాహ్నం, ఆపై పది సాయంత్రం. ఈ కాలాల్లో ఏది యే భావంలో పూజకు యోగ్యమో చెప్పబడింది ఈ శ్లోకాల్లో. ఒక బార 24 నిమిషాలకు **సమానమైన** కాల ప్రమాణంగా లెక్క. అంటే ఆకాశంలో సూర్యుడు 6° పైకి సాగే కాలం, మోటు లెక్క బారెడు దూరం.

**శ్లో॥ జన్మావధి యజేన్మంత్రీ**
**మహాసిద్ధిమవాప్నుయాత్ ।**
**సర్వేషాం గురురూపః స్యా-**
**దైశ్వర్యం చ దినే దినే ॥ 59**

**శ్లో॥ యది గురుస్వభావః స్యాత్**
**తదా మధుమతీం లభేత్ ।**
**యది వివేకీ నిర్యాతి**
**మహావననివాసవాన్ ॥ 60**

**ప్రతిపదార్థం :** మంత్రీ = మంత్రజ్ఞుడు, జన్మావధి = బ్రతికినంత కాలము, యజేత్ యది = (పై జెప్పినట్లు) పూజించినట్లయిన, మహాసిద్ధిమ్ = మహాసిద్ధిని, అవాప్నుయాత్ = పొందును; దినే దినే = అనుదినము, యది గురుస్వభావః స్యాత్ = గురువు యొక్క స్వభావముతో ఉన్నచో, సర్వేషాం = అందరికి, గురురూపః = గురువు రూపము గలవాడై, ఐశ్వర్యం చ = ఐశ్వర్యమును కూడ (పొందును); యది వివేకీ = వివేకము గలవాడై, మహావననివాసవాన్ = మహారణ్యమున నివసించువాడై, యది నిర్యాతి = మరణించినచో, తదా = అప్పుడు, మధుమతీమ్ = మధుమతి అను పేరుగల విద్యను, లభేత్ = పొందును.

**తాత్పర్యం :** మంత్రజ్ఞుడు జన్మంతా పూజించినచో మోక్షాన్ని పొందగలడు. గురుస్వభావం గలవాడు దినదినాభివృద్ధిగా గురువు రూపంలో పూజలందుకొని ఐశ్వర్యాన్ని పొందగలడు. వివేకియై వనవాసం చేస్తూ మరణిస్తే, మధుమతి అనబడే విద్యను పొందగలడు.

**మంత్రజ్ఞుడు** మంత్ర స్వరూపాన్నీ మంత్రదేవతాస్వరూపాన్నీ తెలిసినవాడు కనుక జన్మంతా చేసిన సాధన ఫలితంగా మహాసిద్ధిని, అంటే మోక్షాన్ని పొందుతాడు.

**గురుస్వభావం** అంటే తానెఱిగినది నలుగురికీ చెప్పటం, సాధనలో ఆసక్తి గలవారికి మార్గదర్శకం చెయ్యటం, ఇత్యాది లక్షణం. ఈ లక్షణం గలవాడు గురువుగా లోకంలో గౌరవాన్ని, ధనాన్నీ వృద్ధిగా పొందగలడు.

**వివేకి** అంటే దేని ప్రయోజనం, విలువ యేపాటిదో శాంతచిత్తంతో తర్కించి, విచారించి నిశ్చయబుద్ధితో ప్రవర్తించేవాడు. కనుక ఇతడు లౌకికతకు దూరంగా వనవాసం చేస్తూ సాధన చేస్తాడు. ఆ సాధనలోనే మరణించినట్లయితే మధుమతీ విద్యను పొందగలడు.

**శ్లో॥ బ్రహ్మచర్యవ్రతస్థో వా**
**అథవా స్వపురే వసన్ ।**
**పీఠబ్రాహ్మణమాత్రేణ**
**మహాషోఢాశ్రమేణ చ ॥ 61**

**శ్లో॥ పశుభావస్థితో మంత్రీ**
**సిద్ధవిద్యామవాప్నుయాత్ ।**
**యది పూర్వాపరస్థాం చ**
**మహాకౌలికదేవతామ్ ॥ 62**

**శ్లో॥ కులమార్గస్థితో మంత్రీ**
**సిద్ధిమాప్నోతి నిశ్చితమ్ ।**
**యది విద్యాః ప్రసీదన్తి**
**వీరభావం తదా లభేత్ ॥ 63**

**ప్రతిపదార్థం :** స్వపురే = స్వగ్రామమున, వసన్ = నివసించుచు, బ్రహ్మచర్యవ్రతస్థః = బ్రహ్మచర్యదీక్షలోనున్నవాడు, వా అథవా = లేకున్న, పీఠబ్రాహ్మణమాత్రేణ = పీఠబ్రాహ్మణమాత్రముగనుండి, మహాషోఢాశ్రమేణ చ = మహాషోఢాసాధన చేయుట చేతను, పశుభావస్థితః = పశుభావమున ఉన్నవాడు, మంత్రీ = మంత్రజ్ఞుడు, పూర్వాపరస్థామ్ = పూర్వాపరములందున్న, మహాకౌలికదేవతామ్ = మహాకులస్థాన దేవతను, యది = అయినచో (పూజించినచో), సిద్ధవిద్యామ్ = సిద్ధవిద్యను, అవాప్నుయాత్ = పొందును. కులమార్గస్థితః మంత్రీ = కౌలాచారమునందున్న మంత్రజ్ఞుడు, సిద్ధిమ్ = సిద్ధిని, ఆప్నోతి = పొందును, నిశ్చితమ్ = ఇది తథ్యము.

విద్యాః = విద్యలు, యది ప్రసీదన్తి = ప్రసన్నమైనచో, తదా = అప్పుడు, వీరభావం = వీరభావము, లభేత్ = లభించును.

**తాత్పర్యం :** తన ఊరిలోనే ఉంటూ బ్రహ్మచర్యాన్ని దీక్షగా పాటించేవాడున్నూ, లేక, పీఠబ్రాహ్మణుడై మహాషోఢాసాధన చేస్తూ పశుభావంలో ఉన్నవాడున్నూ, లేక, పూర్వాపరస్థమైన మహాకులసాధినదేవతను పూజించే మంత్రజ్ఞుడున్నూ, సిద్ధవిద్యను పొందుతాడు. అట్లే, కౌలాచారసంపన్నుడైన మంత్రజ్ఞుడున్నూ నిశ్చయంగా సిద్ధిని పొందగలడు. విద్యలు ప్రసన్నమైనచో, వీరభావము లభించును.

**పీఠబ్రాహ్మణు**డంటే, బ్రాహ్మణుడైయుండి యేదైనా ఒక శక్తిపీఠంలో గాని మరియొక పీఠంలోగాని సేవచేస్తూ ఉన్నవాడు.

**మహాషోఢాశ్రమేణ** అంటే, **షోఢామహాశ్రమేణ** అన్నట్లే. అర్థం : ఆరు విధములైన మహాశ్రమచేత, అని. ఈ ఆరు విధములైన మహాశ్రమ యేది? అంటే, పంచేంద్రియములు, అహంకారము అను ఆరింటిని తపోదీక్షతో స్వాధీనమయ్యేట్లు శుష్కింపజేసే విధానాలు. లేక, జడశరీరానికి సంబంధించిన మాంస, అస్థి, మజ్జా, చర్మ, మేధో, రుధిరములు ఆరు. ఈ ఆరింటిని వశము జేసికొను పరిశ్రమ. దేహమును, ఇంద్రియములను, అహంకారమును అదుపుచేయకున్న శ్రీవిద్య ప్రసన్నము కాదని భావము. మరిన్ని వివరములకు కులార్ణతంత్రము – 4వ ఉల్లాసము చూడదగును.

**మహాకౌలికదేవత** కుండలినీ దేవత, శ్రీవిద్యాదేవత. ఈ విద్య పూర్వ, అపర భేదాలతో, కౌలాచార వామాచారములుగా ఉన్నది.

**వీరభావం** అనునది మధ్యమభావం. పశుభావంలో అధమం పశుభావం, మధ్యమం వీరభావం, ఉత్తమం దివ్యభావం. అమితమైన దేహబుద్ధి, ఇంద్రియలాలస కలిగిన జీవుడు పశుభావంలో అధముడు గాను, సత్కర్మాసక్తి గల సదాచార సంపన్నుడు ఉత్తముడుగాను, ఈ రెండిటి మధ్యలోని సాధకుడు మధ్యముడు వీరభావంలోని వాడనీ చెప్పబడును.

**శ్లో॥ వీరభావప్రసాదేన**
**దివ్యభావమవాప్నుయాత్ ।**
**దివ్యభావం వీరభావం**
**యే గృహ్ణన్తి నరోత్తమాః ॥ 64**

శ్లో॥ వాంఛాకల్పద్రుమలతా-
పతయస్తే న సంశయః ।
ఆశ్రమీ ధ్యాననిష్ఠశ్చ
మంత్రతంత్రవిశారదః ॥ **65**

శ్లో॥ భూత్వా వసేన్మహాపీఠం
సదా జ్ఞానీ భవేద్యతిః ।
కిమన్యేన ఫలేనాపి
యది భావాదికం లభేత్ ॥ **66**

శ్లో॥ భావగ్రహణమాత్రేణ
మమ జ్ఞానీ భవేన్నరః ।
వాక్యసిద్ధిర్భవేత్ క్షిప్రం
వాణీ హృదయగామినీ ॥ **67**

**ప్రతిపదార్థం :** వీరభావప్రసాదేన = వీరభావము కలుగుటతో, దివ్యభావమ్ = దివ్యభావమును, అవాప్నుయాత్ = పొందగల్గును; దివ్యభావమ్ = దివ్యభావమును, వీరభావమ్ = వీరభావమును, యే = ఎట్టి, నరోత్తమాః = ఉత్తమ మానవులు, గృహ్ణన్తి = పొందెదరో, తే = వారు, వాంఛా = కోరికలకు, కల్పద్రుమలతాపతయః = కల్పవృక్షము, కల్పలతలకు అధిపతులు, న సంశయః = సంశయం లేదు; ధ్యాన నిష్ఠః = ధ్యానమును దీక్షగా చేయునట్టి, ఆశ్రమీ చ = ఆశ్రమవాసియైన వాడున్ను, మంత్రతంత్రవిశారదః = మంత్రతంత్రములలో దిట్ట, భూత్వా = అయి, సదా = ఎల్లప్పుడును, మహాపీఠమ్ = మహాపీఠమున, వసేద్ = ఉండును, జ్ఞానీ యతిః = జ్ఞానియైన యతి, భవేద్ = అగును. భావాదికమ్ = భావము మొదలైనవి, యది లభేత్ = లభించినచో, అన్యేన = ఇతరమైన, ఫలేన = ఫలముతో, కిమ్ = ఏమి పని?, భావగ్రహణమాత్రేణ = భావము కలిగినంత మాత్రమున, నరః = నరుడు, మమ జ్ఞానీ = నన్నెఱిగినవాడు, భవేత్ = అగును; వాక్యసిద్ధిః = వాక్యసిద్ధి, భవేత్ = కలుగును, క్షిప్రమ్ = వెంటనే, వాణీ = వాణి, హృదయగామినీ = హృదయములను చేరునది (అగును).

**తాత్పర్యం :** వీరభావములో పరిణతి కలిగిన తరువాత, దివ్యభావము కలుగును. దివ్యభావమును, వీరభావమును కూడ సాధించిన ఉత్తమ సాధకులు నిస్సంశయముగా

కల్పవృక్షము వంటివారు. కోరికలను తీర్చగలవారు. అట్టివారు ధ్యాననిష్ఠులు, మంత్ర తంత్రవేత్తలు అయిన ఆశ్రమవాసులై మహాపీఠవాసులై, యతులై జ్ఞానులై ఉందురు. భావములలో ఉత్తమత్వము లభించినట్లయిన, ఇంక మరియొక ఫలము కోరదగినది లేదు. భావములలో పరిణతిని సాధించిన సాధకునకు నన్ను గురించిన జ్ఞానము కలుగును. వాక్యసిద్ధి కలిగి, వాని మాటలు వినువారి హృదయమును తాకును.

**శ్లో॥ నారాయణం పరిహాయ**
**లక్ష్మీస్తిష్ఠతి మందిరే ।**
**మమ పూర్ణం తు మాదృష్టీ**
**తస్య దేహే న సంశయః ॥ 68**

**శ్లో॥ అవశ్యం సిద్ధిమాప్నోతి**
**సత్యం సత్యం న సంశయః ।**

*మహాభైరవ ఉవాచ*

**సూచితం తు మహాదేవి**
**కథయస్వానుకంపయా ॥ 69**

**ప్రతిపదార్థం :** లక్ష్మీః = లక్ష్మీదేవి, నారాయణమ్ = విష్ణుని, పరిహాయ = వదలి, మందిరే = అట్టివాని మందిరమునందే, తిష్ఠతి = నిలచును. తస్య = వానియొక్క, దేహే తు = శరీరమున, మమ = నా యొక్క, మాదృష్టీ = లక్ష్మీకటాక్షము, పూర్ణమ్ = పూర్తిగ ఉండును. న సంశయః = సందేహము లేదు. అవశ్యమ్ = తప్పక, సిద్ధిమ్ = సిద్ధిని, ఆప్నోతి = పొందును, సత్యం సత్యమ్ = నిజము నిజము, న సంశయః = సందేహము లేదు.

మహాభైరవః = మహాభైరవుడు, ఉవాచ = పలికెను.

మహాదేవి = ఓ మహాదేవీ!, అనుకంపయా = దయతో, సూచితం తు = సూచింపబడినదానిని గూర్చి మాత్రము, కథయస్వ = చెప్పుము.

**తాత్పర్యం :** లక్ష్మీదేవి నారాయణుని విడచి, అట్టి భక్తుని మందిరంలో నిలచును. వాని శరీరమున ఆ లక్ష్మీకటాక్షము సంపూర్ణముగా ఉండును. ఆతడు తప్పక సిద్ధినొందును. ఇది సత్యము, సత్యము. సంశయము లేదు.

మహాభైరవుడనెను! ఓ మహాదేవీ! నీవిట్లు సూచించిన విషయమును గూర్చి దయతో వివరింపుము.

శ్లో॥ సర్వతంత్రేషు విద్యాసు
భావసంకేతమేవ హి ।
తథాపి శక్తితంత్రేషు
విశేషాత్ సర్వసిద్ధిదమ్ ॥ **70**

శ్లో॥ భావవిద్యావిధిం విద్యే!
విస్తార్య భావసాధనమ్ ।

**భావవిద్యావిధిః**

ఆనందభైరవిరువాచ

భావస్తు త్రివిధో దేవ
దివ్యవీరపశుక్రమాత్ ॥ **71**

శ్లో॥ గురురస్య త్రిధా చాత్ర
తథైవ మంత్రదేవతాః ।
దివ్యభావో మహాదేవ!
శ్రేయసాం సర్వసిద్ధిదమ్ ॥ **72**

**ప్రతిపదార్థం :** సర్వతంత్రేషు = అన్ని తంత్రములలో, విద్యాసు = విద్యలలో, భావసంకేతం ఏవ హి = భావమే సాంకేతికాంశము, తథా అపి = అట్లయినను, శక్తితంత్రేషు = శక్తితంత్రములలో, విశేషాత్ = విశేషముగా, సర్వసిద్ధిదమ్ = అన్ని సిద్ధులనిచ్చునది. హే విద్యే = ఓ శ్రీవిద్యాదేవతా!, భావవిద్యావిధిమ్ = భావవిద్య యొక్క విధానమును, భావసాధనం = భావమును సాధించు ప్రక్రియను గూర్చి, విస్తార్య = వివరముగా, (కథయ = చెప్పుము).

**భావవిద్యావిధానము**

ఆనందభైరవిః = ఆనందభైరవి, ఉవాచ = ఇట్లునెను. హే దేవ = ఓ స్వామీ!, దివ్యవీరపశుక్రమాత్ = దివ్యము, వీరము, పశుభావము అను వరుసలో, భావః తు = భావము, త్రివిధః = మూడు విధములైనది. అస్య = వీనికి, గురుః చ = గురువున్ను, మంత్రదేవతాః = మంత్రము, దేవత, తథా ఏవ = అట్లే, త్రిధా = మూడు విధములుగ, అత్ర = ఈ విషయమున (ఉన్నారు). మహాదేవ = ఓ మహాదేవ!, దివ్యభావః = దివ్యభావము, శ్రేయసామ్ = శుభములను, సర్వ = అన్నిటిని, సిద్ధిదమ్ = సిద్ధింపజేయునది.

**తాత్పర్యం :** అన్ని తంత్రాలలో, అన్ని విద్యలలోనూ భావమే ప్రధానంగా చెప్పబడింది. అయినప్పటికి, శక్తి ఉపాసన విషయంలో విశేషంగా భావమే అన్ని సిద్ధులకు మూలం. ఓ శ్రీవిద్యాదేవతా! ఈ భావవిద్యా విధానమును, భావసాధనను గూర్చి వివరంగా చెప్పగలవు.

**భావవిద్యావిధానము**

ఆనందభైరవి ఈ విధంగా అన్నది. ఓ స్వామీ! భావము మూడు విధాలు : 1. దివ్యభావం, 2. వీరభావం, 3. పశుభావం. ఈ మూడు భావాలకూ వేర్వేరుగా గురువు, మంత్రము, దేవత, అంటే ఒక్కొక్క భావానికి ఒక గురువు, ఒక మంత్రము, ఒక దేవత ప్రత్యేకం ఉంటాయి. ఇదే విధంగా, ఓ మహాదేవా! అన్ని భావాలలోకీ దివ్యభావం అన్ని శుభాలనూ ఇస్తుంది.

**శ్లో॥ ద్వితీయో మధ్యమః ప్రోక్తః**
**తృతీయః సర్వనిందితః ।**
**బహుజపాత్ తథా హోమాత్**
**కాయక్లేశాదివిస్తరైః ॥ 73**

**ప్రతిపదార్థం :** ద్వితీయః = రెండవది, మధ్యమః = మధ్యమ గుణము నిచ్చేదిగా, ప్రోక్తః = చెప్పబడినది; తృతీయః = మూడవది, సర్వ = అన్నిటిలో, నిందితః = అధమమైనది, బహుజపాత్ = ఎంతో జపము వలన, తథా = అట్లే, హోమాత్ = హోమమువలన, కాయక్లేశ = శరీరకష్టం, ఆది = మొదలైన, విస్తరైః = విపరీతమైన కృషి వలన (సాధింపగలిగినది).

**తాత్పర్యం :** రెండవ భావం సాధకులకు మధ్యమం, మూడవది ఎంతో విస్తారమైన జపహోమాల ఫలితంగా శరీరకష్టాలతో సాధించవలసింది కనుక అధమంగా చెప్పబడింది.

70వ శ్లోకంలో చెప్పబడిన క్రమం దివ్య, వీర, పశు భావాలు. ఈ క్రమంలో రెండవది మధ్యమం, అంటే వీరభావం, మూడవది పశుభావం. మొదటిది దివ్యభావం. ఇది సర్వోత్తమంగా 72వ శ్లోకంలో చెప్పబడింది.

**శ్లో॥ న భావేన వినా దేవ**
**తంత్రమంత్రాః ఫలప్రదాః ।**

కిం వీరసాధనేనైవ
మోక్షవిద్యాకులేన కిమ్ ॥ **74**

శ్లో॥ కిం పీఠపూజనేనైవ
కిం కన్యాభోజనాదిభిః ।
స్వయోషిత్ ప్రీతిదానేన
కిం పరేషాం తథైవ చ ॥ **75**

శ్లో॥ కిం జితేంద్రియభావేన
కిం కులాచారకర్మణా ।
యది భావో విశుద్ధార్థో
న స్యాత్ కులపరాయణః ॥ **76**

**ప్రతిపదార్థం :** దేవ = ఓ స్వామీ!, భావేన వినా = భావసిద్ధి లేనప్పుడు, తంత్రమంత్రాః = తంత్రములు, మంత్రములు, ఫలప్రదాః = ఫలమునిచ్చునవి, న = కాదు. వీరసాధనేనైవ = వీరభావసాధన చేసినంత మాత్రమున, కిం = ఏమి ఫలము?, మోక్షవిద్యాకులేన = మోక్షవిద్యయైన శ్రీవిద్యచేత, కిం = ఏమి ఫలము?, పీఠపూజనేన + ఏవ = పీఠమును పూజించినంతతో, కిం = ఏమగును? కన్యాభోజనాదిభిః = కన్యలకు భోజనము పెట్టుట మొదలగు కార్యక్రమములచే, కిం = ఏమి ఫలము?, తథా ఏవ = అట్లే, స్వయోషిత్ = తనయొక్క స్త్రీకి, ప్రీతిదానేన = సంతోషమును కలిగించుటచే, చ = మరియు, పరేషాం = ఇతరులకు, (ప్రీతిదానేన), కిం = ఏమి ఫలము?, జితేంద్రియభావేన = ఇంద్రియములను జయించినానను భావము చేత, కిం = ఏమి లాభము?, కులపరాయణః = శ్రీవిద్యోపాసకుడు, విశుద్ధార్థః = విశుద్ధమైన, భావః = భావము, యది న స్యాత్ = లేకున్నచో, కులాచారకర్మణా = కులాచారమును పాటించుటచేత, కిం = ఏమి లాభము?

**తాత్పర్యం :** ఓ స్వామీ! భావసిద్ధి కలుగకున్నచో, తంత్రములు, మంత్రములు, వీరభావసాధన నియమములు, శ్రీదేవ్యుపాసన, శ్రీచక్రపూజ, కన్యలకు భోజనదానం మొదలైనవి, తన భార్యకు ప్రీతిగూర్చుట, అన్యులకు ప్రీతిగూర్చుట, తాను ఇంద్రియములను జయించితిననుట, ఇవన్నియు, భావశుద్ధిలేనివానిపట్ల, ఆతడెంత కులాచారమును పాటించువాడైనను, వృథయే, వ్యర్థమే.

**పీఠపూజనము** అంటే శ్రీచక్రపీఠమును పూజించటం.

**కులము :** శ్రీకులము, కాళీకులము అని రెండు విధాలు. శ్రీకులంలో సుందరీ, భైరవీ, బాలా, బగళా, కమలా, ధూమావతీ, మాతంగీ, స్వప్నావతీ అను అష్టదేవతలుంటారు. కాళీకులంలో, కాళీ, తారా, రక్తకాళీ, భువనేశ్వరీ, మహిషమర్దినీ, త్రిపురా, దుర్గా, ప్రత్యంగిరా అను అష్టదేవతలుంటారు. **కులపరాయణు**డంటే ఈ రెండు కులములలో ఒకదానికి చెందినవాడు. **కులాచారకర్మము** అంటే ఈ రెండు విధాల సంప్రదాయముల ఆచారమునకు సంబంధించిన కార్యకలాపాలు. ఇవి కూడా కౌలము, వామము అని రెండు విధాలు. కౌలాచారము అహింసాత్మకము. వామాచారము హింసాత్మకము.

75వ శ్లోకంలోని ఉత్తరార్ధాన్ని ఇట్లా కూడా అన్వయించవచ్చు : పరేషాం = ఇతరలకు, స్వయోషిత్ప్రీతి = తన భార్యవలన సంతోషమును, దానేన = ఇచ్చుట చేత. ఈ అన్వయం వామాచారమునకు సరిపడునేమో, కాని కౌలాచారమునకు సరిపడదు. ఈ గ్రంథము కౌలాచారప్రధానము. అయినను, సందర్భోచితముగ ఈ వామాచార ప్రసక్తి అనుకొనవచ్చు.

**శ్లో॥ భావేన లభతే ముక్తిః**
**భావేన కులవర్ధనమ్ ।**
**భావేన గోత్రవృద్ధిః స్యాద్**
**భావేన కులశోధనమ్ ॥ 77**

**శ్లో॥ కిం తథా పూజనేనైవ**
**యది భావో న జాయతే ।**
**కేన వా పూజ్యతే విద్యా**
**కేన వా పూజ్యతే మనుః ॥ 78**

**ప్రతిపదార్థం :** భావేన = భావముచే, ముక్తిః = మోక్షము, లభతే = లభించును; భావేన = భావముచే, కులవర్ధనమ్ = కులవృద్ధి, భావేన = భావముచే, గోత్రవృద్ధిః = గోత్రవృద్ధి, భావేన = భావముచే, కులశోధనమ్ = కులశుద్ధి, స్యాద్ = కల్గును. యది భావః న జాయతే = భావము జనించనట్లయిన, తథా = అట్లు, పూజనేన ఏవ = పూజామాత్రముచేతనే, కిం = ఏమి ఫలము? కేన వా = ఎవరిచేతనైతే,

విద్యా = శ్రీదేవి, పూజ్యతే = పూజింపబడుచున్నది? కేన వా = ఎవరిచేతనైతే, మనుః = మంత్రము, పూజ్యతే = పూజించబడుచున్నది?

**తాత్పర్యం :** భావముచే మోక్షము లభించును; కులగోత్రములు వృద్ధియగును; కులము శుద్ధియగును, భావము సిద్ధించక పోయినచో, కేవలము పూజామాత్రమున లాభము లేదు. శ్రీవిద్యాదేవత పూజించబడినట్లునూ కాదు, ఆ మంత్రము జపించబడినట్లున్నూ కాదు. అంటే, భావసిద్ధి సర్వప్రధానమని తాత్పర్యం.

**శ్లో॥ ఫలాభావశ్చ దేవేశ!**
**భావాభావాత్ ప్రజాయతే ।**
**ఏతన్మంత్రస్య కథనే**
**శంకతే మమ మానసః ॥ 79**

**శ్లో॥ త్రిలోకం సంజయేత్ ప్రాయః**
**సర్వరత్నసమాగమః ।**
**నావీక్ష్య నిర్జనం కుర్యాత్**
**కథం తత్ కథయామి తే ॥ 80**

**ప్రతిపదార్థం :** దేవేశ! = ఓ దేవదేవా!, భావ = భావముయొక్క, అభావాత్ = లేమి వలన, ఫల = ఫలముయొక్క, అభావః చ = లేమి కూడా, ప్రజాయతే = కలుగుచున్నది. మమ = నాయొక్క మానసః = మనస్సు, ఏతత్ = అట్టి ఈ, మంత్రస్య = మంత్రశాస్త్రము యొక్క, కథనే = చెప్పుటలో, శంకతే = వెనుకాడుచున్నది. ప్రాయః = బహుశః, ఆగమః = ఆగమశాస్త్రము, సర్వరత్నసమా = అన్ని రత్నములతో సమానము, త్రిలోకమ్ = మూడు లోకములను, సంజయేత్ = జయించును. నిర్జనమ్ = జనము లేమిని, అవీక్ష్య = చూడక, న కుర్యాత్ = చేయదగినది కాదు. తత్ = అట్టిదానిని, తే = నీకు, కథమ్ = ఎట్లు, కథయామి = చెప్పగలను?

**తాత్పర్యం :** ఓ దేవదేవా! భావసిద్ధి లేని కారణంగా ఫలసిద్ధికూడ కలుగదు. అటువంటి ఈ మంత్రశాస్త్రవిషయమును చెప్పవలెనంటే నా మనస్సు సందేహిస్తూన్నది. ఆగమ శాస్త్రము అన్ని రత్నముల సమానము. మూడు లోకాలను జయించగలది. చుట్టూ ఎవరూ లేకుండ చూచి మాత్రమే చెప్పదగినది. అట్టి దానిని నీకు ఎట్లా చెప్పగలను?

**శ్రీ ఆనందభైరవ ఉవాచ**

**శ్లో॥ త్వత్ ప్రసాదాన్మహాదేవి!**
**విద్యాస్వప్నప్రబోధిని! ।**
**సర్వపంచప్రపంచానాం**
**దీక్షా దేయా మహేశ్వరి! ॥ 81**

**శ్లో॥ యద్యతో దేవి సర్వేషాం**
**భూతానాం స్వాపకారణమ్ ।**
**కరోమి కథయ త్వం మాం**
**భావమార్గోత్తమోత్తమమ్ ॥ 82**

**ప్రతిపదార్థం :** శ్రీ ఆనందభైరవః = శ్రీ ఆనందభైరవుడు, ఉవాచ = ఇట్లనెను.

మహాదేవి! = ఓ మహాదేవీ!, విద్యా = ఓ మహావిద్యా!, స్వప్న = స్వప్నమున, ప్రబోధిని = జ్ఞానమును కలిగించుదానా! మహేశ్వరి = ఓ మహేశ్వరీ!, త్వత్ = నీయొక్క, ప్రసాదాత్ = కృపవలన, సర్వపంచ = పంచతత్త్వములతో కూడిన, ప్రపంచానామ్ = ప్రపంచముయొక్క, దీక్షా = దీక్ష, దేయా = ఇవ్వదగినది. అతః = ఆ కారణమున, దేవి! = ఓ దేవీ!, సర్వేషాం భూతానామ్ = భూతములన్నిటికి, స్వాపకారణమ్ = నిద్రకు కారణమును, యది కరోమి = చేసినట్లయిన, త్వమ్ = నీవు, మామ్ = నన్నుగూర్చి, నాకు, భావమార్గ = భావమార్గములో, ఉత్తమ + ఉత్తమం = అన్నిటికంటె ఉత్తమమైన దానిని, కథయ = చెప్పుము.

**తాత్పర్యం :** ఓ మహాదేవీ! నీవే మహావిద్యాదేవతవు. నీ కృపచే స్వప్నంలో జ్ఞానం మేల్కొంటుంది. నీవే మహేశ్వరివి. పంచతత్త్వములతో కూడి ఈ ప్రపంచదీక్షను నాకివ్వవలసినది. అందుకనుకూలముగ నేనొకవేళ భూతములన్నిటికి నిద్రను కలిగించినచో, నాకు నీవు భావములలో కెల్ల ఉత్తమమైన దివ్యభావమును గూర్చి ఉపదేశింపుము.

**పంచతత్త్వములు :** 1. భూమి, 2. ఆకాశము, 3. అగ్ని, 4. నీరు, 5. వాయువు.

## కుమారీలక్షణమ్

### శ్రీమహాభైరవ్యువాచ

శ్లో॥ ప్రథమం దివ్యభావస్తు
కౌలికే శృణు యత్నతః ।
సర్వదేవార్చితాం విద్యాం
తేజఃపుంజప్రపూరితామ్ ॥ 83

**ప్రతిపదార్థం :** కుమారీలక్షణమ్ = కుమారీదేవతయొక్క లక్షణము.

శ్రీమహాభైరవీ = శ్రీమహాభైరవి, ఉవాచ = ఇట్లనెను.

ప్రథమమ్ = మొదట, కౌలికే = కులసంప్రదాయములో, సర్వదేవ = దేవతలందరిచేత, అర్చితామ్ = పూజింపబడు, తేజఃపుంజ = తేజస్సులతో, ప్రపూరితామ్ = నిండియుండు, విద్యామ్ = విద్యను గురించి, దివ్యభావః తు = దివ్యభావమునైతే, యత్నతః = సావధానముగా, శృణు = వినుము.

**తాత్పర్యం :** మొదట దేవతలందరూ పూజించేది, తేజస్సులతో నిండినదిన్నీ అయిన విద్యను గురించి కులసంప్రదాయంలో దివ్యభావమును చెబుతాను. సావధానంగా వినుము.

శ్లో॥ తేజోమయీం జగత్సర్వాం
విభావ్య మూర్తికల్పనామ్ ।
తత్తన్మూర్తిమయైః రూపైః
స్నేహశూన్యేన వా పునః ॥ 84

**ప్రతిపదార్థం :** తేజోమయీమ్ = తేజస్సుతో నిండిపోయిన, జగత్ + సర్వామ్ = జగత్తు అంతయు తానైన, మూర్తికల్పనామ్ = సాకారమూర్తిగా, తత్ + తత్ + మూర్తిమయైః = ఆయా మూర్తులతోనున్న, రూపైః = ఆకారములతో, విభావ్య = విశేషముగ భావించి, వా = మరియు, పునః = అటుపై, స్నేహశూన్యేన = సంగములేనిదైన,

శ్లో॥ ఆత్మానం తన్మయం కృత్వా
సర్వభావం తథైవ చ ।

**తత్సర్వాం యోషితం ధ్యాత్వా**
**పూజయేద్యతమానసః ॥ 85**

**ప్రతిపదార్థం :** ఆత్మానమ్ = తతను, ఆత్మను, సర్వభావమ్ = అన్ని భావములతో నున్నదానిని, తన్మయం కృత్వా = దానియందే లగ్నము చేసి, తత్ + సర్వామ్ = ఆ సమస్తముయొక్క సమాహారరూపమైన, యోషితమ్ = దేవతను, ధ్యాత్వా = ధ్యానించి, యతమానసః = మనోనిగ్రహముతో, పూజయేత్ = పూజింపవలెను.

**తాత్పర్యం :** జగత్తంతయూ తన తేజస్సుతో నిండియున్న సాకారమూర్తిగా, ఆయా మూర్తుల రూపములతో విశేషముగ భావించి, మరియు అటుపై, సర్వభావములతో నిండియున్న ఆత్మను, సంగరహితముగ లగ్నముచేసి, ఆ సమస్తమునకు సమాహార స్వరూపమైన దేవతను ధ్యానించి, మనోనిగ్రహముతో పూజింపవలెను.

మనోనిగ్రహము, నిస్సంగము ఈ సాధనకు ఆయువుపట్లు. సాధకుని భావనలోని యే మూర్తియందైన సంగమేర్పడినచో, నిగ్రహము సడలి, ధ్యానము చెడి, పూజ శూన్యకర్మయైపోవును.

**శ్లో॥ అశేషకులసంపన్నాం**
**నానాజాతిసముద్భవామ్ ।**
**నానాదేశోద్భవాం వాపి**
**సద్గుణాలాస్యసంయుతామ్ ॥ 86**

**శ్లో॥ ద్వితీయవత్సరాదూర్ధ్వం**
**యావత్ స్యాదష్టమాబ్దకమ్ ।**
**తావజ్జప్త్వా పూజయిత్వా**
**కన్యాం సుందరమోహినీమ్ ॥ 87**

**శ్లో॥ దివ్యభావస్థితః సాక్షాత్**
**తంత్రమంత్రఫలం లభేత్ ।**
**కుమారీపూజనాదేవ**
**కుమారీభోజనాదిభిః ॥ 88**

**ప్రతిపదార్థం :** అశేషకులసంపన్నామ్ = అన్ని కులములతో సంపన్నమై, నానాజాతి సముద్భవామ్ = అనేక జాతులలో జన్మకలిగిన, నానాదేశోద్భవామ్ = అనేకదేశములలో

జన్మించిన, వా అపి = అంతకు మించి, సద్గుణా = సుగుణములతో, లాస్య = విలాసముతో, సంయుతామ్ = కూడినదైన, ద్వితీయవత్సరాత్ + ఊర్ధ్వమ్ = రెండేండ్లకు పైబడి, అష్టమాబ్దకమ్ = ఎనిమిదవ యేడు, యావత్ స్యాత్ = ఎప్పుడగునో, తావత్ = అంతలో, కన్యామ్ = కన్యయైన, సుందరమోహినీమ్ = మోహింపజేయు సౌందర్యము గలదానిని, దివ్యభావస్థితః = దివ్యభావమున స్థిరుడైన సాధకుడు, జప్త్వా = జపించి, పూజయిత్వా = పూజించి, సాక్షాత్ = సాక్షాత్తుగా, తంత్రమంత్రఫలమ్ = తంత్ర మంత్రములయొక్క ఫలమును, లభేత్ = పొందును. కుమారీ పూజనాత్ + ఏవ = కుమారీపూజవలననే, కుమారీ భోజనాదిభిః = కన్యలకు భోజనమిచ్చుట మొదలైన కార్యకలాపములచేత,

**శ్లో॥ ఏకద్విత్ర్యాదిబీజానాం**
**ఫలదా నాత్ర సంశయః ।**
**తాభ్యః పుష్పఫలం దత్వా**
**అనులేపాదికం తథా ॥ 89**

**శ్లో॥ బలిప్రియం చ నైవేద్యం**
**దత్వా తద్భావభావితః ।**
**ముదా తదంగమాల్యానాం**
**బాలభావవిచేష్టితః ॥ 90**

**శ్లో॥ జాతిప్రియకథాలాప-**
**క్రీడాకౌతూహలాన్వితః ।**
**యథార్థం తత్ ప్రియం తత్ర**
**కృత్వా సిద్ధీశ్వరో భవేత్ ॥ 91**

**ప్రతిపదార్థం :** ఏక = ఒకటి, ద్వి = రెండు, త్ర్యాది = మూడు మొదలైన వాని, బీజానామ్ = బీజాక్షరములయొక్క, ఫలదా = ఫలమునిచ్చునది, అత్ర = అనుటలో, న సంశయః = సందేహములేదు. తాభ్యః = వారికి, పుష్ప = పుష్పము, ఫలమ్ = ఫలము, తథా = అట్లే, అనులేప = మైపూత, ఆదికమ్ = మొదలైనవి, దత్వా = ఇచ్చి, చ = మరియు, తద్ భావ = ఆ భావముతో, భావితః = తాదాత్మ్యమైనవాడు, బాలభావ = బాలభావములోని, విచేష్టితః = విశేషచేష్టలు గలవాడై, బలిప్రియమ్ = ఆహారమున ప్రేమగల దేవతను, నైవేద్యమ్ = నైవేద్యమును, తత్ + అంగ = ఆమె

